# ప్రణయరంగం

(ఏడు రంగాలుగల నాటకం. సుప్రసిద్ధ ఆంగ్లవక్త రూపకకర్త
రిచర్డ్ బ్రిన్స్లీ షెరిడన్ (1751 - 1816) రచనలలోని
'రైవల్సు' దీనికి మూలం.)

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

అన్ని స్వామ్యాలూ
గ్రంథకర్తవి

ప్రథమ ముద్రణం
జూలై 1953-1000

# హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనా సరే, లేక సొమ్ము వసూలు చేసుకొనే నిమిత్తమైనా సరే, ఈ ప్రదర్శనాలలో ఏదైనా సభఎదట ఆడదలచిన ప్రతి సంఘంవారున్నూ ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందకపోవడం కాపీ రైట్ చట్టప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరువాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమండ్రి

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

వెల
రూపాయి

# ప్రణయ రంగం

## రంగాల పేర్లు

1. రెండు పేర్ల ప్రియుడు
2. తండ్రి చెప్తే తను వద్దన్న పిల్లే తన ప్రియ
3. మాయపేరు ప్రియుడు అసలుపేర వధువుతో సమావేశం
4. చెరో పేరుకీ చెరో సవాలూనూ
5. యువతీ యువకుల్ని కలపడానికి పెద్దల యత్నం
6. యుద్ధరంగానికి అందరూ ప్రయాణం
7. ద్వంద్వయుద్ధాలు అబద్ధం, వివాహాలు నిజం

## పాత్రలు

పరాంకుశం—(ముసిలి జమీందారు)

కుమార సేనం }
వసంతం } —(పరాంకుశం కొడుకు, కథానాయకుడు)

సారధి—(పరాంకుశం నౌఖరు)

ఆకాశం—(కుమార సేనం నౌఖరు)

కృపాకరం—(కుమార సేన స్నేహితుడు, ఒక ప్రేమ బాధకుడు)

దేవయ్య—(కల్పకాన్ని ఆశించిన ఒక ప్రియుడు)

జ్వాలారంగం—(కల్పకాన్ని ఆశించిన మరో కాముకుడు)

తలుపులు—(దేవయ్య నౌఖరు)

రాంభాణమ్మ—(కల్పకానికి మేనత్త అనవలసినమాట బదులు అటువంటి మరోమాట అంటూంటే వ్యక్తి)

కల్పకం—(వధువు)

ఉలిక్కి—(రాంభాణమ్మకి దాసి)

## సంకేతములు: (నటించేవారికి)

RF - కు. ఎ. - కుడిఎదర
RM - కు. మ. - కుడిమధ్య
RB - కు. వె. - కుడివెనక
LF - ఎ. ఎ. - ఎడమఎదర
LM - ఎ. మ. - ఎడమమధ్య.
LB - ఎ. వె. - ఎడమవెనక
MF - మ. ఎ. - మధ్యఎదర
MM - మ. మ. - మధ్యమధ్య
MB - మ. వె. - మధ్యవెనక

# ప్ర ణ య రం గం

| పాత్ర: | వచ్చే రంగాలు |
|---|---|
| ప— | 1, 2, 3, 5, 6, 7 |
| కు— | 2, 3, 4, 5, 6, 7 |
| సా— | 1 |
| ఆ— | 1, 2, 6, 7 |
| కృ— | 2, 7 |
| డే— | 2, 4, 7 |
| జ్వా— | 2, 4, 7 |
| త— | 4, 6, 7 |
| రాం— | 1, 3, 5, 6, 7 |
| క— | 3, 5, 6, 7 |
| ఊ— | 2, 3, 7 |

| రంగం: | | వచ్చే పాత్రలు |
|---|---|---|
| 1. | — | ఆ, సా, ఊ, క, రాం, ప |
| 2. | — | ఆ, కు, కృ, డే, ప, జ్వా, ఊ |
| 3. | — | కు, ప, ఊ, రాం, క |
| 4. | — | డే, త, జ్వా, కు |
| 5. | — | రాం, క, ప, కు |
| 6. | — | రాం, క, ఆ, త, ప, కు |
| 7. | — | డే, జ్వా, కు, కృ, ప, త, రాం, క, ఆ, ఊ |

# ప్రణయరంగం

## రంగం-1

[రెండో తెర ఎదట వీధి. R F నించి సారథి నిమ్మళంగా నడుచుగుంటూ పోయి L F కి నిష్క్రమిస్తాడు. అతడి వెనకాలే ఆకాశం వస్తాడు. వెళ్ళిపోయినవాణ్ణి నిదానించి చూసి, వాణ్ణి గుర్తు పట్టినట్టు నటించి]

ఆ—ఇదేమిటీ! ఆశ్చర్యంగాఉందే! సారథిలా ఉన్నాడే! (మళ్ళీచూసి) సారథే! (చప్పట్లుకొట్టి) ఎవోయ్ సారథీ! ఇటుయిటు!

సా—ఎవరూ! ఆకాశంగారా! ఈ విలాసపురం నువ్వెప్పుడొచ్చావయ్యా!

ఆ—(నానుస్తూ) వచ్చాం!

సా—అంటే నువ్వేనా?

ఆ—అవును, నీమాట! నువ్వు ఒక్కడవే వచ్చావా?

సా—అంతా వచ్చాం, మేం.

ఆ—అంటే!

సా—ముసిలి అయ్యగారూ! మరి......

ఆ—ఆయనికి కీళ్ళనెప్పులుగా!

సా—అవును. ఆ కీళ్ళనెప్పులు చాలా జోరుగావచ్చి పడేటట్టు కనపడిందిట. అవివచ్చి పడేలోపల వాటిని దగాచేసి

పారేయ్యడానికి ఆయన నన్ను బండి కట్టెయ్యమన్నారు. కట్టేశాను. బుర్రున వచ్చేశాం.

ఆ—ఆయన అంత తొందరగా తెమిలారా?

సా—తొందర లేకపోతే ఆయన పరాంకుశంగారే కారు. ఆయనతో పని—తల్చుకున్నప్పుడే తాతపెళ్ళి,

ఆ—సరే. ఇంకా ఎవరొచ్చారు ఆయనతో!

సా—ఆయన తమ్ముడుకూతురు రత్నమాలా, దాసీ, వంటవాడూ, గుర్రాలవాళ్ళూ వచ్చాం. మేం సరేగాని, మన చిన్నయ్యగారూ మీరూ వచ్చారుగావునుగదా ఇక్కడికీ, మన ముసిలిబాబుగారు ఈ పడుచుబాబుగారిని ఇక్కడ చూస్తే ఎంత నిర్ఘాంతపోతారో! నువ్విప్పుడు నౌఖరీ చేస్తూంటూ మన చిన్న బాబు కుమారసేనంగారి దగ్గిరేనా?

ఆ—అబ్బే కుమారసేనంగారిదగ్గిర నేను నౌఖరీ మానేశాను.

సా—ఏమిటి? నిజంగా!

ఆ—ఆ. మానేసీ...

సా—మరోరిదగ్గిర జేరావేమిటీ?

ఆ—ఆ అల్లాంటిదే. వసంతం అనే చిన్నదళవాయి దగ్గిర.

సా—అబ్బే, ఎంతపనిచేశావ్! మీకు మన కుమారసేనంలాంటి యజమాని తల్లకిందులైనా దొరుకుతాడా!

ఆ—అందుకనే మానలేదు!

సా—ఏమిటీ, మానలేదూ ?

ఆ—మానలేదు.

సా—మరి మానేశానన్నావ్ కాట్టయ్యా !

ఆ—అవును మానేశాను.

సా—హారి నీయింట పటారంగానూ, చిన్నబాబు గారిదగ్గిర మానేశావా, మానలేదయ్యా ?

ఆ—కుమారసేనంగారిదగ్గిర మానేశాను గాని చిన్నబాబుగారిదగ్గిర మాన్లేదు.

సా—అబ్బ అవునయ్యా, మన చిన్నబాబుగారి పేరు, అనగా మన ముసలయ్య పరాంకుశంగారి అబ్బాయి పేరు కుమారసేనంగారు కాదూ !

ఆ—అబ్బ, ఇక చెప్పేస్తాను, విను.

సా—చెప్పు.

ఆ—ఒక్ఖ ముక్కలో చెప్పాలంటే, ఆ కుమారసేనాని గారూ ఆ వసంతం అనే చిన్నదళవాయిగారూ ఒకడే.

సా—హారి ! నీపలుకు బంగారంగానూ ! అల్లా చెప్పూ ! ఆయనా ఈయనా ఒకడేనా ?

ఆ—అవును. అంచేత, ప్రస్తుతం ఈ విలాసపురం వచ్చింది ఈ చిన్నదళవాయి వసంతంగారే గనక మిగతా సగం యజమానిగారైన సేనానిగారితో నాకు నిమిత్తం లేదు.

సా—ఔర ! నే చెబుతా వినండి ఆకాశంగారూ, చిన్నబాబుగారికి ఇదేదో పైత్యం అయిఉంటుంది. అవును గాని, అసలుసంగతేమిటీ ?

ఆ—నువ్వు గుట్టుగా ఉంటావా ?

సా—ఆ. ఒట్టు.

ఆ—అయితే విను. ఏముందీ ? అంతా ప్రేమ ! ప్రణయం ! ప్రణయవిషయంలో వేషాలు వెయ్యడం దేవతల నాటినుంచీ వస్తూనేఉంది.

సా—ఆమాత్రం నేనే అనుకున్నాను. ఎవర్తో భామ ఉంటేనేగాని నాటకమేఉండదు. కాని చిన్నబాబుగారు సేనానిపని మానుకుని చిన్నదళవాయిగా నటించడం ఎందుకూ ?

ఆ—ఎందుకా ! అక్కడేవుంది ఈ విషయంలో మజాకా. విను. సారథీ ! కుమారసేనంగారు ఓ యువతిని ప్రేమిస్తున్నారు. ఆ యువతి వింతఅభిరుచులు గల వ్యక్తి. చిన్నబాబుగారు ఒక ఉపదళవాయి అని ఆవిడకి తెలియడం నయంటగాని, గొప్ప జమీాఉన్న పరాంకుశ ప్రభువుగారి వారసుడని తెలియకూడదుట !

సా—అదేమి అభిరుచో ఆవిడికి ! సెబాసు ! దాని కేంవచ్చెగాని, ఆవిడికి పోనీ ఆస్తి ఏమన్నా ఉందా ?

ఆ—ఓ, లక్షా ! దేశంలో సగంసొత్తు ఆవిడదే ! మనం కూలివాడికి కూలియిచ్చేస్తామే అల్లాగా ఆవిడ ప్రభుత్వఋణాలుకూడా తీర్చిపారెయ్యగలదు. వాళ్ళింటో కుక్క, బంగారప్పళ్ళెంలో తింటుంది. చిలక, ముత్యాలు వప్పుల్తుంది. ఇంతెందుకూ, ఆవిడజనం బ్యాంకునోట్లతో పొట్లాలు కట్టుగుంటారు.

సా—బలే! బలే! సరే. ఆవిడికీ మన సేనానికీ అన్యోన్యత ఏర్పడుతోందా ?

ఆ—అన్యోన్యతలోనూ సామాన్యం అనుకుంటున్నా వేమిటి; చిలకా గోరింకాలా ఉంటూన్నారు.

సా—ఆవిడ పేరు ?

ఆ—కల్పకం! అయితేం, ఒక్కచిక్కుంది.

సా—చెప్పవేంమరీ !

ఆ—ఆవిడకి ఓ మేనత్తఉంది. ఆమేనత్త మహా కర్ర పిడిఘటం, శని దేవతలాగ అడ్డొస్తోంది. కాని, ఆ ముసిలావిడ మన చిన్నబాబుగారిని చూడలేదు. మేం లవంగపురం మకాంలో ఉంటూండే టప్పుడు మా బాబుగారికి ఆ అమ్మాయిగారి పరిచయం అయింది.

సా—దివ్యంగాఉంది. వారికి శీఘ్రమే దాంపత్యాను బంధం కలగాలని కోరుతున్నాను. సరేగాని, ఆకాశంగారూ! ఈ విలాసపురం మహా ఇద్దైన ఊరులాఉందే! దీన్నిగురించి తెగవిన్నాం. ఇక్కడ వినోదాలకి అంతూ తెంపూలేదు.

ఆ—ఆ పోదురూ! రాత్రి పదకొండుగంటల్లో అన్నీ తామని ఆగిపోయి ఊరుకుంటాయి. ఆతరవాత కాస్త పేకాడుకోడానికేనా లేదు. ఎల్లానో తంటాలు పడుతున్నాను.

సా—పేక మీ రొక్కరే ఆడుకుంటున్నారా ?

ఆ—లేదు. కృపాకరంగారి మనిషివాడూ నేనూ కాలక్షేపం చేస్తున్నాం! నువ్వూకూడా, రా. ఆయన భలే భేమాషారకం, నువ్వు ఆఘనం భే చెవికోసుగుంటావు.

సా—అవును. నే నతణ్ణి ఎరుగుదును. అతని పేరు తలుపులు. అతని యజమానే రత్నమాలగారిని పెళ్ళాడ బోతూన్నది.

ఆ—సరే! సరేగాని...ముసలయ్య ఎక్కడ దిగారు?

సా—దగ్గిరే. మీరుకూడా వస్తారా ?

ఆ—తరవాత వస్తాలే. ముసలయ్యగారు ఇక్కడికి రావడానికి కారణం కీళ్ళనెప్పులకి అందకుండా తను ముందో చ్చెయ్యాలనేనా, ఇంకా ఏమన్నా పనిమీద వచ్చారా?

సా— తెలియదండి.

ఆ—నీకు తెలియకపోను, చెబుదూ !

సా—నిజమేనండి, నాకు తెలియదు. చిన్నబాబుగారికి ఈఊళ్ళో ఎదో సంబంధం ఉందిట. పిల్లని చూడ్డానికి వచ్చారేమో అని నా అనుమానం.

ఆ—అవోటూ ! చిన్నబాబుగారికి ఆసంగతి తెలియదే ! సరే సరే ! నువ్వు వెళ్ళిపో ! అదుగో కస్తూరసేసంగారు ! (అని కుడిపక్కకి చూపిస్తాడు) నేను వెళ్ళాలి,

సా—(L F కి పోతాడు)

ఆ—(R F కి పోతాడు)

[రెండవతెర లేవగా, శ్యాంభాణమ్మ ఇల్లు. ఒక సోఫా మీద కల్పకం కూచుని పుస్తకం చదువుకుంటూ ఉంటుంది. కొన్నిపుస్తకాలు పక్కగా పడిఉంటాయి. L F ని ఒక కుర్చీ ఉండాలి. ఉళక్కి R F నించి గబగబా వస్తుంది]

ఉ—అమ్మాయిగారూ, అమ్మాయిగారు !

క—(లేచి) ఏమే, అంత కంగారుగా ఉన్నావేం ?

ఉ—వీధిచివర్నుంచి ముసలమ్మగారు వస్తున్నారు. ఆవిడతో ఒక ముసిలాయన వస్తున్నారు.

క—ఈలోపుల సర్దుకుందాం లేస్తూ! నువ్వు గ్రంథాలయానికి వెళ్ళావా ? పుస్తకాలు తెచ్చావా ?

ఉ—కొన్ని తెచ్చానండి. ఇయిగో. (అని దాచినవి తీసి యియ్యబోతుంది)

క—'పెంకిముగుడూ,' 'ఆడంగివరుడూ,' 'షోకేళా భర్తా' ఉన్నాయా ?

ఉ—లేవండి. ఎవరో పట్టుకుపోయారట. అవీ లేవు. 'మారణప్రణయం,' 'హృదయప్రమాదాలూ,' 'శృంగార శోభా' కూడా లేవు.

క—ఏవీ (అని తెచ్చినవి అందుకుని చదివినట్టు నటిస్తూ) 'విషమ సమస్య,' 'సున్నితపు బాష్పాలు,' 'ప్రణయ పలాయనం,' 'పురుషుని పూర్ణవిధులు'—సరేలే, ఏవోవొకటి. (చిటికెలువేసి) ఊఁ ఊఁ ఇవన్నీ దాచెయ్.

ఉ—(కిందపడిఉన్న పుస్తకాలు తీసి ఒక్కొక్కటే కల్పకానికి యిస్తూ) ఇది ?

క—ఇదా ! 'అమ్మాయిక అత్యాచారం'-బల్లకింద పారెయ్.

ఉ—ఇది !

క—ఇదా ! 'లోపల కుళ్ళేమనిషి'-జేబులో వేసెయ్యి!

ఉ—ఇది !

క—అబ్బ ఇదా ! 'అబలాంతరంగం'—ఆమూల పడేసిరా !

ఉ—ఏది ఉంచమన్నారూ ?

క—'స్త్రీగీతావళి' తియ్యి, అందులో 'అభిమానత్వం' ఉన్న పుట పైకిరానీ !

ఉ—(చూసి) అంతదాకా ఎవరో చింపేశారు.

క—అయితే 'గాంభీర్యం' అనే అధ్యాయందగ్గిర గుర్తుపెట్టు. 'స్త్రీ నీతిజాబులు' ఇక్కడే ఉండనీ. నువ్వు దొడ్లోకి పో.

ఉ—(L M కి పోతుంది)

క—(తనుకూడా L M కి నడిచి పక్కని నుంచుని, రాంభాణమ్మ వస్తూండడం కనిపెట్టి అదృశ్యం అవుతుంది)

రాం—(R F నించి ముందుకి నడిచి వెనక్కితిరిగి) రండి రండి, పరాంకప్రభువుగారు ! మీరు ఎంతో కీర్తిశేషులు ! దయచేసి ఇల్లా దయచేసి, చాలా చాలా దయుంచండి.

ప—(వచ్చి కర్రమీద ఆనుకుని కుంటుతూ సోఫా మీద కూర్చుంటాడు)

రాం—మా మేనగోడల్ని మీ మొదటికి ఆహూతం చేస్తూ నుండండి. (L M వైపు నడిచి) కల్పకం ! ఓసిదుర్మతీ, దుందుభీ ! ఇట్లా రావే పెండరాళేనూ !

క—(L M నించి ఒక అంగవచ్చి నిలబడుతుంది)

రాం—(వెనక్కి వెళ్ళి సోఫాకి కుడిపక్క ఎదర నుంచుంటుంది) ప్రభూ! అట్లా చూడండి. అదే మా అల్పసంకల్పాల కల్పకం! ఇది కోరి కోరి మంచి 'ఫూల్' లా ఆరి తేరింది. వంశగౌరవం బొత్తిగా పునీతం చేసిపారేసి, ఒక గవ్వైనా చెయ్యని ఎవడో ధవ్వా అబ్బాయిగురించి తన సర్వమూ గుర్విస్తుందిట!

క—రాంభాణమ్మత్తా!

రాం—కొత్తవాళ్ళఎదట ఉత్త అత్తాఅంటేచాలు—పేరెట్టి రాంభాణమ్మత్తా-అక్కర్లేదు.

క—అత్తా, వెనక నేను నిన్ను గురించి ఏమని ఆలోచించుగునేదాన్నంటే—

రాం—ఏమన్నావ్? నన్నుగురించి ఆలోచించుగునేదానివి! ఆసీ! అభీరించేదానివికావు, నయమే. ఆలోచించుగోవలిసినంత అత్యంతం నీ కెల్లావచ్చిందో నాకు తెలియకుండాఉందే!—పడుచుకన్యలకి ఆలోచన సుతరామూ కూడదు ఏమనుకున్నావోగాని! మేం ఇప్పుడు నీతో వినయపూర్వకంగా సెలవిచ్చేదేమిటంటే, నువ్వు ఒక్కమాట సత్వరంగా మాతో మనవిచెయ్యాలని. ఏంమాటా! ఇటీవల నీమనస్సుని పట్టుగున్న ఘటాన్ని నువ్వు పూర్తిగా సంస్మరించి పారేసి మరి వాడు నీకు ధారకం లేనంతగా వాణ్ణి మరిచిపోవాలని!

క—అయ్యో, అత్తయ్యా అత్తయ్య! మన జ్ఞాపకాలది ఒకదారీ, మన ఇష్టాలది మరోదారీనూ! మరిచిపోడం అనేదికూడా అంత తేలిక కాదు.

రాం—కావలిసినంత తేలిక అని నే నంటాను. మనిషికి బుద్ధిపుట్టి ప్రారంభం అంటూ చెయ్యాలిగాని, లేకపోతే మరిచిపోడం అంత తేలికపని భూమ్మీద లేదు. నాకు రూఢిగా తెలుసు. (కళ్ళు ఒత్తుగుంటూ ఏడుపుస్వరంతో) మీ మామయ్య—చచ్చి సునర్గాన్నున్నారు. వారిని నే నిప్పుడెంత మరిచిపోయానూ, (తాపీగా) ఆయన అసలు జనించే ఉండకపోతే ఆయన్ని ఎంత ఎరక్కుండా ఉండేదాన్నో అంతగా మరిచేసేశాను—అంతగా ఎల్లా చెయ్యగలిగానూ? అల్లా చెయ్యడం నావిధి అనుకున్నాను, తీరిపోయింది (గంభీరంగా) చెబుతున్నాను విను, కల్పకం! తీవ్రమైన భయంకర జ్ఞాపకాలు కన్నెపడుచుకి తగవ్.

ప—(కల్పకం వైఖరిచూసి) అరె! రూఢిగా తెలుస్తోంది. ఏది జ్ఞాపకం పెట్టుగోవద్దన్నారో అది మరవడానికి ఈ అమ్మాయి అభినయించడంకూడా లేదే! ఔర! ఈవిడ చదువుకున్న ఫలితంగావునిది.

క—అత్తా! నువ్వు నన్నింత చిన్నచూపు చూడ్డానికి, నేచేసిన నేరం ఏమిటమ్మా?

రాం—ఈ వ్యాపారంలోంచి ఎల్లానో అల్లా బయటికి దుర్గమించడానికి యత్నించకో, కూచమ్మ! ఇంతువిషయమై నాదగ్గిర కేవలం సుప్రతిహాతమైన ప్రత్యక్షసాక్ష్యం బోలె

డుంది—సరేకాని, ముందు చెప్పు. చెప్పినట్టు వింటానని వాగ్దానం చేస్తావా? నీయిష్టులు వెతికతెచ్చిన వరుణ్ణి నువ్వు స్వీకరిస్తావా?

క—అత్తా! నేను నీతో తెలిగించి చెప్పేస్తాను, విను. మరొకవరుణ్ణి చూసుగోడానికి నాకేగనక స్వతంత్రత లేకపోతే, మీరు తెచ్చేవరుడంటే నేను పెడముఖం పెట్టవలి పొస్తుంది.

రా—అయ్యో అయ్యో! ఇదెక్కడపిల్లమ్మా! ఎన్ని కోడాలూ పెడముఖం పెట్టడాలూగురించిన గోల నీకెందుకే! అట్లాంటివి కన్నెపడుచుకి తగవుస్మీ. ఏమనుకున్నావోగాని! నువ్వు తెలుసుగోవాలి. ఎన్నికోడాలూ పెడముఖాలూ ఆయేటికాయేడు మీదపడ్డకొద్దీ తగ్గిపోతాయి. అందుకని, ఎప్పుడూకుడా, దాంపత్యం అనేది పెడముఖాలతో ప్రారంభం కావడమే క్షేమతమం. సరి, మరొక నిక్షేపంలాంటి సంబంధం నీకు మేం చూసిపెట్టేపట్టానికి, నువ్వు ఆ పాడుదాళ్వా వసంతం అనేవాణ్ణి వదులుకుంటానని మాటయిస్తావా?

క—నా మనస్సుతో సంబంధం లేనిమాట చెప్పవలిసిందని నన్ను మీరు కోరుతున్నారు. అటువంటిది జరిగితే నామాటతో సంబంధంలేని పన్లు నేను చెయ్యాలి.

రాం—అల్లాగా! అయితే దయచెయ్, లోపల గదిలోకి దయచెయ్! ఇంకోళ్ళతోకలిసి నువ్వెక్కడ కూర్చోగలవ్, నీ పైత్యకళికలూ నువ్వూ కూర్చోవాలిగాని!

క—అవశ్యం పోతానత్తా! చూస్తూ చూస్తూ పాడైపోడం నాకిష్టంలేదు. (అని: L M కి నిష్క్రమిస్తుంది)

రాం—(L F కేసి ఉన్న కుర్చీలో కూచుంటూ) చూశారా, పరాంకుప్రభూ! మీకు ఎంత ఉతుకుష్టపుకోడలు వస్తుందో!

ప—చూశాచూశా! ఇందులో ఆశ్చర్యపడవలిసింది ఏమీలేదు, రాంభాణమ్మగారూ! ఇదంతా ఏమిటో తెలుసా, ఆడపిల్లలకి చదువు నేర్పడంవల్ల వచ్చిన తప్పునిసరిఫలితం! నా శపథం వినండి, నాకే ఒక వెయ్యిమంది కూతుళ్ళున్నా రనుకోండి, దైవసాక్షిగా చెబుతున్నాను, వాళ్ళల్లో ఒక్కర్తికి కూడా ఒక్క అక్షరమేనా నేర్పించను, నూయిగారడీయేనా నేర్పిస్తానుగాని!

రాం—అబ్బోఅబ్బో! పరాంకుశంగారూ, మీరు ఆడజాతికి కేవలం పరిపందిలా ఉన్నారే!

ప—నేను ఊరికే అనలేదమ్మా! నేను మీయింటికి వస్తూండగా దారిలో మీ మేనగోడలి దాసీని చూస్తిని కదా, అది గ్రంథాలయంలోంచి వస్తోంది. దాని వంటినిండా పుస్తకాలే, నేలబారు చట్కారీరకం! తక్షణం ఊహించుకున్నాను ఆ దాసీగారి యజమానురాలు ఎంత స్వధర్మం తెలిసిన వ్యక్తోగదాఅని.

రాం—నిజమేనండి, ఈ నగరంలాంటివి బొత్తిగా అఘోరస్థలాలు!

ప—అందులోనూ, పుస్తకాలు ఇంటికి చదువుకోడాని కిచ్చే గ్రంథాలయా లుంటాయేం, అవి యథార్థంగా కుళ్ళు జ్ఞానం విస్తరింప చెయ్యడానికి పుట్టిన నిత్యకార్తి వృక్షాలు!

అవి సంవత్సరం పొడూగుతా ప్రస్తూనేఉంటాయి! అందు వల్ల, ఘంటాపథంగా చెబుతున్నాను, రాంభాణమ్మగారు! వాటిపత్రాలు ఒక్కసారి తిరగెయ్యాలని ముచ్చటపడేవాళ్లు వాటిఫలాలుకూడా ఎప్పటికైనా చవిచూడాలని కోరతారు.

రాం—పోదురు పోదురూ, పరాంకుశంగారు, నిశ్చయంగా స్త్రీవిద్యగురించి ప్రహస్యాస్పదంగా మాట్లాడుతున్నారు. ముసలయ్యగారు స్త్రీలనిగురించి వీరసం చూపిస్తున్నారు.

ప—ఇదోటా! అయితే, ముసలమ్మా! ఆడచదువు గురించి నేను తమతో వాదించను. ఆసంగతి అట్లా ఉండనీండి. దానికంటె ముఖ్యతరమైన అసలు విషయంలోకి వత్తాం. నేనుచేసిన ప్రతిపాదనకి మీకు ఏవిధమైన ఆటంకమూ లేనుకద!

రాం—ఎంతమాత్రమూ లేదని, నిశ్చయంగా అంటున్నాను. దేవయ్యగారు అనేవరుడితో నేను ఫలానా అని చెప్పతగ్గ ఖరారేమీ చేసిఉండలేదు. కల్పకం అతగాడు వద్దని పట్టుగాఉంది గనక మీ కుమారుడు నెగ్గడానికే ఎక్కువ వీళ్ళు కనిపిస్తాయి.

ప—సరేనండి. నేను మావాడికి తక్షణం ఈ సంగతి రాసేస్తాను. వాడికి ఈ సంగతి లేశమైనా తెలియదు, నా బుర్రలో ఇది కొంతకాలంనించి ఉన్నప్పటికీ! వాడిప్పుడు తన దండుతో సేనలో ఉన్నాడు.

రాం—మేము మీ అబ్బాయిని ఎన్నడూ చూడలేదండి, పరాంకుశంగారు ! దీనికి అతడేమీ ఆటంకం చెప్పడని నేను ఆశిస్తాను.

ప—ఆటంకమా ! మావాడా ! చెప్పడానికి గుండెలుండద్దూ !

రాం—సరేనండి, పరాంకుశంగారు, దేవయ్యగారికి పెందరాళే ఉద్వాసన చెప్పించేస్తాను. మీ కుమారుడి యొక్క ప్రళయగీతం వినే ధోరణిలోకి కల్పకాన్ని తీసుకొస్తాను. మీ సేనానితో చెప్పడంలో ఈ అమ్మాయి ఖాత్రిగా అవశ్యం అనిపించే ఘటం కాదని మనవిచెయ్యండి.

ప—ముసలమ్మగారూ ! నేనీ విషయం చాలా చాకచక్యంతో నడుపుతాన్లెండి—మరి సరే, నేనుంటాను. తీరా వచ్చి మరిచిపోక. మీ అమ్మాయితో వ్యవహరించేటప్పుడు మీరు కరుగ్గా ఉండాలమ్మాయ్ ! నామాట వినండి, నిరంకుశంగా ఉండాలి.

రాం—అల్లానేనండి నిరంకుశంగారు !

ప—ఈ సంబంధం తిరస్కరించిందా, గదిలో పెట్టి రాయంటి తాళంవేసెయ్యండి. విన్నారా ! (వెళ్ళబోతూ మళ్ళీవచ్చి) అన్నీ ఎందుకూ ?. లెక్ఖ నాలుగు రోజులపాటు తిండెట్టకుండా లంకణం కట్టించారా, ఎంత దార్లోపడుతుందో మీకిప్పుడు తెలియదు. (అని R F కి సంతోషంతో వెళ్ళిపోతాడు.)

రాం—(తనలో) ఏ ఉపాయం పన్నితేం, నా సహజ జ్ఞానంతో ఈపిల్లని అణిచిపట్టెయ్యడం నాకు చాలా సంతోషంకాని, జ్వాలారంగం అనే మరోఅబ్బాయి తిరుగుతున్నాడు. అతడంటే నాకు సన్నిపాతం అని కల్పకం పోల్చుగుంది. ఉళక్కి నాగుట్టు బయటపెట్టేఉంటుందా! అబ్బే! ఉళక్కి శుద్ధమొద్దు. పిల్చి అడిగెయ్యవలిసిందే! (LM కేసి నడిచి చూస్తూ) ఒసే ఉళక్కీ ఉళక్కి! (అది వచ్చేలోగా తనలో) మరోమరో దళారీ దాసీఅయిఉంటే నేను నమ్మతానా! ఇది వెర్రిపీనుగ!

ఉ—(ఎడమ మధ్యనించి వచ్చి) పిల్చారా, మామ్మగారు!

రా—మరేనే! ఇల్లారా (అని కుడిఎడరికి జరిగి) కల్పకం లోపలగదిలో ఉందా?

ఉ—మరేగావునండి.

రాం—ఈవేళ నువ్వు వీధులో కెళ్ళినప్పుడు జ్వాలారంగం కనిపించాడా?

ఉ—అబ్బే, ఆయన మొహమేనా కనపడలేదండీ.

రాం—నేచెప్పిన రహస్యం నువ్వు...

ఉ—(చెవులు మూసుగుంటూ) ఎంతమాట, ఎంతమాటాడారు బామ్మగారు!

రాం—ఏమోలే, నీకు నోట్లో నువ్గింజ నాన్దు. నాలికేదీ!

ఉ—(నాలిక చూపిస్తూ) కావలిస్తే తెగ్గోసెయ్యండి.

రాం—సరే సరే నోరుముయ్! అట్టే అమాయికంగా ఉండకు, టోపీపడగలవ్!

ఉ—నేనా! నాకేమండీ టోపీపడేదాకా!

రాం—నువ్వు పనిచూసుగుని, కాస్సేపట్లో నాకు కనపడు. జ్వాలారంగం పేర మరో ఉత్తరంరాసి నీచేతి కిస్తాను. జాగర్త చెబుతున్నా విను ఉళక్కీ! వాళ్ళ రహస్యాలూ వాళ్ళరహస్యాలూ మోసుగొచ్చి నువ్వు నా చెవిని వెయ్య వలిసిందానవేగాని, అల్లా చెయ్యకుండా నారహస్యాలు బయటపెట్టావా ఒఖ్ఖసారి నేను కోపంతో అక్కటికం చూపించి అనుకంపించేసరికి నువ్వు హండిలి ఆకాశ మంటి పోతావ్! జాగర్త. నువ్వు అమాయికురాలివిగదా అని చెప్పేసి క్షమించనుస్మీ నీ వాక్యాయపైత్యం! ఇప్పుడే వస్తాను ఇంట్లోకినడు...(అని R F కి వెడుతుంది)

ఉ—(తనలో) ఆహాహా, ముసలమ్మ గడుసుదనం! (ఒక కాగితం తీసి ముసలమ్మ వెళ్ళినవేపు చూపిస్తూ) ఇదిగో నా అమాయికత్వం విలవ. ఒకళ్ళసంగతి మరొకళ్ళకి తెలియకుండా అందరిదగ్గిరా బోలెడు సొమ్మూ సరుకులూ లాగేశాను. అమాయికంగా కనిపించడమే అన్నిటికంటే మాయ! (అని L M కి పోతుంది).

## రంగం-2

[కుమారసేనం బస. ఒక చిన్నబల్లా రెండు మూడు చిన్నకుర్చీలూ ఉంటాయి. అతడు యోధవేషంలోఉండి, బల్లదగ్గిర కూచుని కాగితాలు చూసుకుంటూ ఉంటాడు. కాగితాలు కొంచెం సర్ది బల్లగంట కొడతాడు. ఆకాశం, నడుంకట్టి R F నించి వస్తాడు]

కు—ఏమిటీ?

ఆ—ఇందాకా నేనిక్కడికి వస్తూంటే, వారింటిదగ్గిర పెద్దయ్యగారు కనపడ్డారండి.

కు—ఎవరు? మానాన్నగారే!

ఆ—చిత్తం. వెంటనే ఆయన అనారోగ్యంగా ఉన్నట్టు మనం విన్నామనీ, ఎల్లాఉంటున్నారో కనుక్కోడానికి మీరు ఎప్పుడు రావచ్చునో అడగడానికి నన్ను మీరు పంపారనీ, అన్నానండి.

కు—నేనుకుడా ఈ విలాసపురం వచ్చానని తెలియడంతోటే ఏమన్నారు, మానాన్న?

ఆ—(బుర్రగోక్కుంటూ) ఏమంటారండి! ఆ మాట వినగానే ఆయన ఎంత ఆశ్చర్యపడ్డారో చెప్పలేమండి. ఎంత ముసిలాయనాకుడా అంతాశ్చర్యపడడు. వీరు రెండుమూడు అంగలు వెనక్కివేశారు, సణిగారు, తిట్టుగున్నారు, మీరు ఈవ్వారు రానడం ఏంరోగం అని అడిగారండి.

కు—(సకిలించి) ఊఁ. నువ్వు ఏమన్నావ్ ?

ఆ—(కొంచెం చిరునవ్వుతో) నేనాండీ. నేను కొంచెం కోతలుకోశానండి. సరిగ్గా ఏంకోతలో ఇప్పుడు మరిచిపోయానండి. కాని, రూఢీగా నమ్మండి, యథార్థం ఒఖ్ఖపిసరేనా ఆయనకి దొరకనియ్యలేదు. అది సరిగానండి, అయ్యగారూ, ఒఖ్ఖ మానివండి. మనం ఈవ్రూరు ఎందుకొచ్చామని చెబుతూండాలో కూడబలుక్కుంటేగాని, ముందు ముందు ప్రమాదాలు తప్పించుగోడానికీ సమసందర్భంగా బొంకడానికీ వీలుండదండి. మీనాన్నగారితో వచ్చిన బంట్రోతులంతా నన్ను అదేప్రశ్నలు, అదేప్రశ్నలు.

కు—నువ్వు వాళ్ళదగ్గిర ఏమీ కక్కలేదుకద !

ఆ—ఒక్కమాటకాదు, ఒక్క అక్షరమేనా బెసకనియ్యలేదండి. కాని, చోదకుల్లోకల్లా తెలివైన సారథి ఉన్నాడేం.

కు—చంపేశావురా, చవటగా ! వాణ్ణిగాని నమ్మి చెప్పేశావా ?

ఆ—అబ్బెబ్బే ! ఛీఛీఛీ.....ఒఖ్ఖపలుకు, ఒఖ్ఖ అక్షరంలో తలకట్టుకుడా చెప్పలేదండి. నేనే ! అసాధ్యుణ్ణి. వాడు, నన్ను మరీమరీ అడిగాడండి. నేను టక్కరిచేశాను, బలేటక్కరి చేశాన్లెండి, మరి ! సారథిగారూ సారథిగారూ, మేం ఇక్కడికి రిక్రూటుకోసం వచ్చాం అన్నానండి, అంతే. అంటే ఏముటో నేను తేల్చలేదు. మనుష్యుల రిక్రూటో,

డబ్బు రిక్రూటో అంగబలం రిక్రూటో ఏదైనా సరే వాడికి ఒకటే, ఎవడికైనా అంతే.

కు—సరే. అది బాగానే ఉంది. రిక్రూటునిమిత్తం వచ్చాం అంటున్నాడు.

ఆ—రిక్రూటుకోసం వచ్చాం అంటే అద్భుతంగా పని జరిగిపోతుందండి. ఆమాటే కొంచెం కీవిగా ఉండడానికి సారథితో ఏంచెప్పానో తెలుసాండి, మీరప్పుడే—కుర్చీల మోతకి పనికిరానివాళ్ళని అయిదుగురిసీ, వాలంట్రీ బంట్రో తుల్ని ఏడుగుర్నీ, బిలియర్డ్సాట నౌఖర్లని పదముగ్గుర్నీ సైన్యంలో చేర్పించారని చెప్పానండి.

కు—హోరి, మూర్ఖరాజా, అవసరంకంటె ఎన్నడూ ఎక్కువ చెప్పకు.

ఆ—చిత్తం చిత్తం. కాని, సమర్థించుకుంటేనేగాని ఏ అబద్ధం నిలవదండి.

కు—సరే.

ఆ—మీనాన్నగారు అడిగితే రిక్రూటు జ్ఞాపకం ఉంచుగోండి.

కు—సరే సరే సరే. ఎవరో పిలుస్తున్నారు, చూసి, తీసుగురా. కృపాకరం అయిఉంటుంది.

ఆ—(R F కి వెడతాడు)

కు—(తనలో) మా రత్నమాలకూడా ఊరొచ్చినట్టు కృపాకరం ఎరిగుండడు. కాస్సేపు బావమరిది సరసం కానియ్యొచ్చు.

ఆ—(R F నించి వచ్చి పక్కకి ఒసలగా, కృపాకరం ఉసూరుమంటూ, దీనంగా వస్తాడు.)

క—ఇదుగో, కృపాకర్! రా! అన్నప్రకారంగా ఊడిపడ్డావే?

కృ—వెళ్ళబోయినపని దార్లోనే అయిందీ! ఏమిటి విశేషాలూ! ఏకాడికొచ్చింది నీకల్పకం వ్యవహారం?

క—అల్లానేఉంది. మొన్న ఆ అమ్మాయితో కలహం పెట్టుగుని వచ్చేసినదగ్గిర్నించీ నేను అక్కడికి వెళ్ళలేదు. కబురు చెయ్యకపోతుందా అని ఎదురుచూస్తున్నాను.

కృ—ఆ అమ్మాయికి నచ్చజెప్పి, క్షణంలో, లేవదీసుకు చక్కాపోకూడదూ?

క—ఏడిసినట్టే ఉంది. అల్లాచేసి, ఆ అమ్మాయికి కొట్టుగొచ్చే ఐశ్వర్యంలో మూడువంతులు చెడనాడుకోనా? అబ్బెబ్బే, అయితే వెనకేచేసుండేవాణ్ణి తీసుకుని వెళ్ళిపోడం అనే పని.

కృ—అయితే మరి జాప్యం ఎందుకూ? పిల్లగురించి నీకు రూఢి అనిపిస్తే, పిల్లతో చెప్పెయ్, ముసలమ్మకి అసలు రూపంలో కనిపించెయ్, యీ ముసలయ్యకి రాసెయ్!

క—నెమ్మది నెమ్మది. అల్లాచేసేద్దామన్నా చిక్కగానే ఉంది.

కృ—ఏమిటా చిక్కు?

కు—దళవాయి వసంతంత్రో ఆకల్పకం లేచిరావడానికి సిద్ధంగా ఉన్నమాట రూఢి.

కృ—నువ్వేగా?

కు—అవును. అయితేం? నేను ఫలానా అని తెలిడం, రాయబారాలూ, చూపులూ, ప్రధానమూ, లాంఛనాలూ, ఉసూరుమంటూ మామూలు పెళ్ళి, ఇవన్నీ ఆపిల్లకి ఇష్టంఉన్నట్టు తోచదు. అంచేత, కల్పకాన్ని కొంచెం తయారుచేసి క్రమేపీగాని నా ద్వంద్వవైఖరి తెలియనియ్యకూడదు. ఏదోచేస్తానుగాని, హోటల్కి మనం కలిసి భోజనానికి వెళదాం, ఉండు, కృపాకర్.

కృ—నాకెందుకోయ్, నలుగురితోనూ పంక్తిని కూచుని భోజనం చేసేట్టుందా నాస్థితి!

కు—పెంకితనం చేశావంటే, నువ్వు నలుగురిలోకీ రాకుండా నిన్ను ఒక్కెట్టి, వదులుకుంటాను, కృపాకరం! అబ్బబ్బ! నీకున్నంత విసుగూ, తప్పులెంచడం, మాట వినిపించుకోకపోవడం మరి ఏకాముకుడికీ ఉండదు. ప్రేమించడంలో పౌరుషం ఉండాలోయ్!

కృ—నలుగుర్లోనూ కూచోడానికి అనర్హుణ్ణని ఒప్పుకుంటాను.

కు—నేనుమాత్రం ప్రేమలో లేనుటోయ్! అందులోనూ నాది ఎంత సాహస శృంగారం? నీకుమల్లే నేను ఇడవుతూ కూచుంటానా? సంశయాలూ భయాలూ ఆశలూ

వాంఛలూరా పోగుచేసి అడ్డదిడ్డంగా ఓ గడ్డిమేటి తయారు
చేసి తలలో ధరించి పల్లెటూరి కన్నెపిల్లలాగ ఊరేగుతూం
టూనా ?

కృ—(నిట్టూర్పువుచ్చి) అదికాదోయ్, బాబీ !
నేపెట్టుకున్నంత ధ్రువంగా నువ్వు ప్రేమలక్ష్యం పెట్టుకో
లేదు. నీప్రేమ—జూదంలో నువ్వు పందెంకాస్తాన్, ఓడితే
మళ్ళీ మళ్ళీ కాయగలవ్. నాపందెమే ఒకటి, అది ఓడా
నంటే, నాపని మట్టం !

కు—అరె ! ఇప్పుడు ప్రత్యేకంగా మారత్నమాల
గురించి నీకు పట్టుగున్న బాధ ఏమిటి ? నీబుర్రలో జరిగే
పైత్యపు గారడీవల్ల నీకు కనిపించే భయకారణాలు ఏమిటి ?

కృ—అయ్యో, బాబీ, నువ్వెరగవోయ్ ! భయ
కారణాలు ఏమిటనా అన్నావ్ ! అన్నీనూ, లతా ! రత్న
మాల ఉత్సాహం గురించి, ఆరోగ్యం గురించి, జీవంగురించి!
నే లేకపోతే, విసుక్కుంటుంది, నే నెప్పుడొస్తానా అని ఆదుర్దా
పడుతుంది, నేను ఏమయ్యానో అని కుంగిపోతూంటుంది.
నీకేంతెలుసు ! రత్నమాల ఆరోగ్యం ఎంతసున్నితం ?
వర్షపుజల్లు పడితే రత్నమాల వణికిపోతుంది. ఈదురుగాలి
కొడితే రత్నమాలకి రొంపభారం. మధ్యాహ్నంఎండ,
సాయంత్రం మంచు నేను ప్రాణాధికంగా చూసుకునే రత్న
మాలని తల్లకిందులు చేసేస్తాయి. బాబీ ! సున్నితమై ప్రతి
దానికీ కలిగిపోయే ఆత్మలుగల కాముకులకి ఎడబాటు వచ్చి

నప్పుడు పంచభూతాల్లో ప్రతీదీ కుట్రచేస్తోందనే అనుమానం గాఢకాముడికి తట్టుతుంది !

కు—సరేలే, అది ఆ కాముకుణ్ణిబట్టి ఉంటుంది కాని, రత్నమాల కులాసాగా, ఉత్సాహంగా ఉన్నది అని నీకు తెలిస్తేచాలా ?

కృ—అదే నాకు తెలియవలిసింది. ఆమాటేగనక నాకు తెలిస్తే నాసౌఖ్యం మిన్నుముట్టుతుంది. ఆమాట వింటానా అనే నాఆతుర్దా.

కు—అయితే, సౌఖ్యపడు. ఆతుర్దా వదులుకో. రత్న మాల మంచి ఆరోగ్యంలో ఉత్సాహంగా ఉంది. ఇప్పుడు ఈ ఊళ్ళో ఉంది.

కృ—ఛ, బాబీ, నన్ను పరిహాసం చేస్తున్నావు గాపును !

కు—లేను లేను. ఇందాకానే మానాన్న వచ్చారు, వచ్చేటప్పుడు రత్నమాలని తీసుకొచ్చారు.

కృ—(నవ్వు మొఖంతో) నువ్వు త్రికరణంగా అంటు న్నావా ?

కు—సరే ! పరాంకుశంగారి హఠాత్ సంకల్పాలు నువ్వు ఎరుగుదువేమో అనుకున్నానే. ఒట్టు నామీద...

కృ—వద్దు వద్దు. చాలు. ప్రియమిత్రమా, చాలు. ఒరే, తెలుపుగాం, టోపీ తేరా ! ఏమోయ్ బాబీ, బ్రహ్మా నందం కలిగించావయ్యా, ఒక్కమాటతో !

ఆ—(R F నించి వచ్చి) మిమ్మల్ని చూడడానికి దేవయ్యగారు వచ్చారండి.

కు—అల్లానా! భేష్. కృపాకరం, నువ్వు వెళ్ళక్కర్లేదు, ఉండు. అతని మకాం మానాన్నగారు దిగినచోటికి దగ్గిరే కావచ్చు. మారత్నమాల ఆరోగ్యం గురించి అతడు చెబుతా డుండు. ఆకాశం! తీసుకురా, దేవయ్యని.

కృ—ఈ దేవయ్య మీవాళ్ళందర్నీ బాగా ఎరుగునా?

కు—చాలా బాగా ఎరుగును. నువ్వు సుతరామూ వెళ్ళిపోకు. దేవయ్య చాలా తమాషావ్యక్తికూడానూ!

కృ—సరే, కానీ, అతణ్ణి అడుగుతాను.

కు—మరో మజాకా, విన్నావా? ఈ దేవయ్య కల్పకాన్ని ఆశిస్తున్నాడుగనక నాకు వైరి—అసగా దళవాయి వసంతానికి! ఇతడినమ్మకం కుమారసేనం కల్పకాన్ని చూడనేలేదని. అందుచేత, దళవాయి వసంతం ఎవడో భడవ, లుచ్ఛాఅంటూ వాడిమీాద చాడీలు నాతో చెబుతూంటాడు.

కృ—ఉండు, వస్తున్నాడు.

[R F నించి ఆకాశం దేవయ్యని ప్రవేశపెడతాడు. దేవయ్య, దుస్తులు సరియైనవి లేకపోయినా, హుషార్‌గా ఉంటాడు]

దే—ఇదుగో! ప్రియమిత్రమా, ఉదార సేనానీ, చిట్టిబాబీ, క్షేమమా? నే నిదేరాకడం. అయ్యా, వందనం.

దిక్కుమాలి రోడ్డుప్రయాణం. బాబీ, వెధవకొరడాలూ చక్రాలూ! తోకచుక్కలాగ వచ్చేశాను, తోకలాగ నా వెనకాల దుమ్ము వచ్చేసింది.

కు—రావోయ్, చిన్నీ, కూర్చో. నువ్వు విపరీత గ్రహానివి గనక అల్లా వచ్చావ్. ఇక్కడికి నిన్ను ఆకర్షించిన కారణంకూడా మాకు తెలుసులే. ఇదుగో కృపాకరం గారు, కృపాకరంగారూ, వీరు దేవయ్యగారు.

దే—మిమ్మల్ని చూసినందుకు నామనస్సు చాలా సంబరపడుతోంది. మీతో బాంధవ్యం అర్థిస్తోంది. (ముఖం చూసి) అయితే, బాబీ, కృపాకరంగారంటే...

కు—మరే మరే. మా రత్నమాలయొక్క కృపాకరంగారు!

దే—అల్లాచెప్పూ! రత్నమాలా మీనాన్నా ఈ ఊరు వచ్చారటనే! నువ్వు చూసేఉంటావ్! కృపాకరం గారూ, మీమాత్రం అదృష్టవంతుడు ఎక్కడా ఉండడు.

కృ—నేను నారత్నమాలని ఈమధ్య చూడలేదండి. ఆ యువతి ఆరోగ్యంగా ఉందనుకుంటాను.

దే—అబ్బో! ఏంఆరోగ్యం ఏంఆరోగ్యం! చాలా ఆరోగ్యంగా ఉందిలెండిమరి! పువ్వులూ నవ్వులూ అన్నట్టుంది. మంచి ఆరోగ్య ఆశ్రమంలా ఉంది.

కృ—నిజమేనాండీ! మనిషికి ఈమధ్య వంట్లో ఎల్లానో ఊరుకుండదని విన్నాన్లెండి.

దే—అబద్ధమండి, శుద్ధాబద్ధం. ఎవడో మిమ్మల్ని క్షోభపెట్టడానికి అన్నాడు. అంతేగాని, మరోటిలేదు. మీకు తెలిసినదానికి కేవలం విలోమంగా ఉంది. నామాట నమ్మండి.

కృ—చూశావోయ్, బాబీ! మీ రత్నమాల ఎంత రొఖ్ఖబేరంగా ఉండగలదో, జబ్బుచేసేటంతగా నే బాధపడుతూంటేనూ!

కు—సరి సరి. ప్రియురాలికి జబ్బుచెయ్యకుండా ఉండడమేమీ అని నీకు కోపంగావును!

కృ—కాదు కాదు. నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావు. ప్రియుడు చెంత లేనప్పుడు యువతికి వంట్లో ప్రశాస్త ఇదిగా ఉండడమో అసహజం అంటావని నే నను కోను. పోనీగాని, బాబీ, అటువంటిది లేకపోడం అటుంచి, ఇంత తీవ్రంగా రాయల్లా నదురూ బెదురూ లేని ఆరోగ్యంలో ఉండడంలో కొంతైనా నిర్దయ ఉందంటావా లేదంటావా, మనస్ఫూర్తిగా చెప్పేయ్!

కు—అవు నవును, నిజమే. నీ పరోక్షంలో రత్నమాల ఆరోగ్యంగా ఉండడం నిర్దయే.

దే—బాబీ, మంచిబసే వెతికావోయ్.

కృ—ఈబస సరేగానండి, రత్నమాల చాలా ఆరోగ్యంగా కనిపించిం దన్నారుగదా, పైగా ఆ అమ్మాయి వినోదంగానూ కులాసాగానూ, మాంచి ఉత్సాహంగానూ కూడా ఉందా? ఏమండీ!

దే—వినోదంతో ఆగుతారేం! ఎక్కడట నలుగుర్లో ఉండనీండి, అక్కడి హుషారంతా, చమక్ యావత్తూ, ఆవిడే! ఆవిడ చమత్కారంలో ఎంతజీవం! ఆవిడ సారస్యంలో ఏమిసరదా !

కృ—వినవోయ్, బాబీ, విను ! అయ్యో, మనసా! స్త్రీ ఉషార్‌గా ఉంటుంది అనేమాటకి తిరుగు లేదుగావును. అయ్యో దైవమా ! దూరాన్ని నేనూ, సౌఖ్యంలో రత్న మాలానా !

కు—చాల్చాలు కట్టిెయ్యవోయ్, మూర్ఖత్వం ! ఇప్పుడిప్పుడేకాదూ రత్నమాల ఉత్సాహంగా లేదేమోఅని వగిస్తివీ ?

కృ—నువ్వే చెప్పుబాబీ ! నలుగర్లోనూ నేను ఆనందదాయకంగానూ ఉత్సాహజనకంగానూ ఉన్నానా ?

కు—ఎంతమాత్రం లేవు.

కృ—సజీవంగానూ వినోదకరంగానూ ఉన్నానా ?

కు—లేవని రాసిస్తాను.

కృ—చమత్కారంగానూ స్వారస్యంగానూ ఉన్నానా ?

కు—కించిత్తేనా లేవు సరిగదా, మిక్కిలి బుద్ధితక్కువగా ఉన్నావుకూడానూ !

దే—బాబీ ! ఈయనకి వంట్లో సరిగాలేదాఏమిటి ?

కు—లేకేం. అబ్బే ! రత్నమాల ఉత్సాహంగా ఉన్నందుకు ఆనందం తెలియపరుస్తున్నారు. అంతే.

కృ—ఆనందం తెలియపరుస్తున్నాను, మరేమరే. (నిస్ప్రుహగా) ఆనందమే. ఆవిడిది అంతి సౌఖ్యకరమైన ధోరణిగనక.

దే—ఆవిడధోరణా? ఎంతనేర్చింది! గాత్రం ఎంత మధురం! వీణవాయింపులో ఎంతమేటి! ఆ పలికింపు—మంద్రమధ్యమ తారస్థాయిల్లో—షడ్జమధ్యమగ్రామాల్లో—అద్భుతం—అద్వితీయం. నెల అయిఉంటుంది. బాజాలమ్మగారింటో, కనస్టర్టుకి, ఈ రత్నమాల ఇల్లా చెరిగేసింది.

కృ—విన్నావా బాబీ, గానంట, పాటట! నాస్మరణ లేదు.

కు—హోవోయ్! గానం ప్రేమకి ఆహారం అన్నారు పెద్దలు!

కృ—అయితే, ఏమండోయ్, అయ్యా! రత్నమాల ఆ సందర్భంలో ఏమేంపాటలు పాడిందండీ?

కు—అబ్బా ఏవో ఓటి పాడిందోయ్, పోనిస్తూ!

కృ—ఏమండీ మిమ్మల్నే!

దే—పాటలా! అవునవును. నాకు జ్ఞాపకంలేదు.

కు—ఎవో! విచారం సూచించే శృంగారపు పాటలయిఉంటాయి.

(పాడుతూ) 'హాప్రియా ననుబాసితే నిక—నే ప్రకారము.....'

దే—అది కాదు (చప్పరించి) అది కాదు!

కు—(పాడుతూ) 'నా సామికి నామీద ఏమో
యింగాక...'

దే—అదీ కాదు. ఆఁ ఉండుఉండు. జ్ఞాపకంవచ్చింది.
'నామనసు నా దేను నా హృదయం నాసొంతం...' అనే పాట
ఒకటి.

కృ—(తనలో) అయ్యో నేనెంత దౌర్భాగ్యుణ్ణి!
ఎల్లాంటి చపలమీద నా ఆశలు పెట్టుకున్నానూ!

కు—ఊరుకున్నావేం, కృపాకర్!

కృ—ఊరుకోక ఉరెట్టుగోమన్నావా! పోనీ రత్న
మాల కాస్త మోతాదుగాఉండి, కాస్త విచారం తెలిపే
పాట ఏరి మరీపాడిఉండకూడదూ! ఏమండీ దేవయ్యా!
రత్నమాల నాట్యంకుడా చెయ్యలేదుకద!

దే—ఆ కన్సర్టునాడు చెయ్యలేదుగాని, మరోనాడు
బ్రహ్మాండమైన లాస్యం చేసింది.

కృ—హాయ్యో హాయ్యో! (అని నెత్తి కొట్టు
కుంటాడు.)

దే—రకరకాల నాట్యంలో పల్లెటూరినాట్యం జనం
ఎంత మెచ్చుకున్నారో చెప్పడానికి అలవికాదు.

కృ—అల్లాంటి గ్రామ్యనాట్యమూ కోతినాట్యమూ
బండజనంఎదట ప్రదర్శించినతరవాత. అందులో ఒక్కడేనా
దుర్జనుడుండకపోతాడా!...రత్నమాల భ్రష్టఅయిపోయింది.
నాహృదయం చీలిపోయింది. నాజీవితం భంగం అయి

పోయింది! పోతాను. (అని చివాల్న లేచి, R F నించి పరిగెట్టుగు పోతూంటాడు.)

కు—ఆగాగు, కృపాకరం! ఈ శుభవార్త చెప్పినందుకు ఈయనకి దణ్ణంపెట్టు!

కృ—పోదూ, దిక్కుమాలివార్త...(R F కి వెళ్ళిపోతాడు.)

కు—అయ్యోయ్యో! వెర్రికృపాకరం! అయిదు నిమిషాలక్రితం ఏమన్నావ్, ఇప్పుడేమైనావు! ఛాగ!

దే—బాబీ! ఈ పెద్దమనిషికి కోపంరా లేదుకద, నేను ఆవిణ్ణి మెచ్చుగుంటూంటే!

కు—కొంచెం ఈర్ష్యలోపడ్డాడు, చిన్నీ!

దే—ఒట్టిమాటలు! ఎవడేనా నవ్వుతాడు, నన్ను గురించి ఈర్ష్యేమిటి, బాబీ!

కు—అందులో ఆశ్చర్యంలేదు, చిన్నీ! నువ్వు గమనించావో లేదో కాని, తళుకుబెళుకుగా ఉండే నీ విలాసమూ, అన్యాపదేశంగా ఉండే నీ ధోరణీ ఇక్కడి యువతీసమూహంలో కొంత సంచలనం కలిగిస్తాయి.

దే—(నవ్వుతూ) ఆ, నువ్వు వేళాకోళం చేస్తున్నావు! ఏం సంచలనం! ఇప్పుడు నేను స్వతంత్రుణ్ణికాను. మరోరి ఆస్తి అయిపోయాను. నాకల్పకం నన్ను పల్లెటూరు వదిలి ఇక్కడికి వచ్చెయ్యమంది. ఆవేషం మానేసెయ్యమంది. మసిల్దానికి ఇందులో జోక్యంలేదు, ఆ పల్లెటూరికోటుకి

పించన్ ఇచ్చేస్తాను, షుర్వా డిస్మిస్ చేసేస్తాను. జుట్టుకి అప్పుడే ట్రైనింగు మొదలెట్టేశాను.

కు—అబ్బా! అసాధ్యుడులా ఉన్నావే!

దే—చెంపల్ని ఉంగరాలు ఇంకా సర్దుకోలేదు కాని, అప్పుడే వెనకాల జుట్టు ఎల్లా చెబితే అల్లా వినడం మొదలెడు తోంది.

కు—సందేహంలేదు, బస్తీరకంగా మారతావు—

దే—తప్పకుండా! ఆపళంగా (కులుకునవ్వుతో) ఆ దళవాయి వసంతం నాకంటపడతాడా, తక్షణం అగ్గిఫోర్! నాకూ వాడికీ తేడా ఏముందో వాడికి ఋజువు చేసేస్తాను.

ఆ—(R F నించి వచ్చి) మీకోసం ఎవరో పెద్దమనిషి వచ్చారండి. వచ్చి కూచోమన్నాఅండీ?

కు—కూచోమను.

దే—మరి నేపోతాను, బాబీ!

కు—ఉండవోయ్! వచ్చింది ఎవరు ఆకాశం?

ఆ—వచ్చిందాండీ, మీనాన్నగారండి.

కు—ఓరి జాగిలం! తక్షణం తీసుకురారా!

దే—నే పోతాను బాబీ! నువ్వు మీనాన్నతో మాట్లాడాలిగా! రాంభాణమ్మ దగ్గిర్నించి ఉత్తరం వస్తుంది, నాబసలోకి. నాకు దగ్గిర స్నేహితుడు జ్వాలారంగం అనే అతణ్ణి రమ్మన్నానుకుడానూ! (దేవయ్య R B కి పోతాడు)

కు—సరి యిక, నాన్నగారి ఉపన్యాసం. నా రహస్యం అతడికి తెలిసిపోలేదుగద! కీళ్ళనెప్పులు ఎక్కువై ఇతణ్ణి ఇల్లు కదలనీకపోయినా బాగుండిపోను!

[R F నించి ఆకాశం, పరాంకుశంగారిని
ప్రవేశపెట్టి వెళ్ళిపోతాడు]

—నాన్నగారు! రండి! మిమ్మల్ని ఇక్కడ కలియడం చాలా సంతోషం అవుతోంది. మీ రిప్పుడు బాగానే ఉన్నారు. అధాత్తుగా విలాసపురం వచ్చేశారని వినడంతోటే మొదట్లో మీ ఆరోగ్యం గురించి కొద్దిగా భయంవేసింది.

ప—అవును బాబీ! చాలా భయంవేసుంటుంది నీకనుకుంటాను.—ఏమిటీ నువ్వు వచ్చినపనీ, రిక్రూటు నిమిత్తమా?

కు—మరేనండి. ఉద్యోగరీత్యా వచ్చాను.

ప—బాగుంది. బాబీ! నాకూ నిన్ను చూడ్డం సంతోషంగానే ఉంది. ఇక్కడ నువ్వు కనిపిస్తావనుకో లేదు అసలు. నీకు చిన్నవ్యవహారపు పనిగురించి రాయాలనుకున్నాను కూడానూ—(నిదానించి) బాబీ! ఈమధ్య నాకూ తోస్తోంది. కాలం దగ్గిరపడింది, శరీరం దుర్బలం అయింది, బాబీకి నాగురించిన బాదరబందీ ఇక ఆట్టేకాలం ఉండదు, పాపం, అని.

కు—అల్లాంటిమాట లనకండి, నాన్నా! ఇప్పుడంత బలంగానూ తేటగానూ మీరు లోగడ ఎన్నడూ

లేరు. మీరు ఇల్లానే ఉంటూండాలని తరుచు ప్రార్థిస్తూం టాను.

ప—నీప్రార్థనలు ఫలించాలని మనసారా ఆశిస్తు న్నాను. కాని, బాబీ, నేను ఇంత బలంగానూ చలాకీగానూ ఉంటూ నిన్ను ఇంకా ఎంతకాలం పీడించాలోగదా అని అనుకుంటూంటాను. అసలు యధార్థం ఏమిటంటే, బాబీ, నీమోస్తరు చురుకుతనంగల కుర్రాడికి, సేనలో కమిషన్ మీద ఉద్యోగమూ నే నిదివరకు నీకిచ్చిన సొమ్మూ కలిపి ఒక్కతృణం అనుకోడానికికూడా పనికిరావు.

కు—మీరు ఎంతో మంచివారు.

ప—నాకంఠంలో ఊపిరి ఉండగానే, నాకుర్రాడు ప్రపంచంలో ఎన్నతగ్గవాళ్ళల్లో ఒకడవాలని నావాంఛ. అందుచేత, నిన్ను ఒక స్వంతజమీకి నాధుణ్ణిగా చేసేద్దామని నిశ్చయించుకున్నాను.

కు—నాన్నా, మీదయ నన్ను పరవశుణ్ణి చేసేస్తోంది. మీ వాత్సల్యానికి ప్రతిఫలంగా నాహృదయంలో ఉండవలసిన పితృభక్తికంటె మీఔదార్యానికి ప్రతిఫలంగా నా బుద్ధికితోచవలసిన కృతజ్ఞత మరీ ఎక్కువా అనిపిస్తోంది.

ప—నీయందు నాకున్న ఆసక్తి నువ్వింత సూక్ష్మంగా గ్రహించినందుకు సంతోషిస్తున్నాను—రెండుమూడువారాల్లో ఒక పెద్ద ఎస్టేటుమొత్తానికి నువ్వు ప్రభువుకాగలవు.

కు—కాగానే, నాకృతజ్ఞత ఏరకంగా ఉంటుందో చూద్దురుగాని లెండి! మీ వదాన్యభావం వెలిబుచ్చడానికి

నాకు మాటలు చాలవ్ !—అయితే నాన్నగారూ ! నన్ను ఈ సైనికోద్యోగం వదిలి వచ్చేసెయ్యాలన్నా దంటారని తెలుస్తాను.

ప—అదా ! అది నీభార్య ఎల్లాఅంటే అల్లా జరుగుతుంది.

కు—నాభార్యాండీ ?

ప—అవున్రా బాబీ ! ఆసంగతి నువ్వూ అదీ కలిసి నిర్ణయించండీ ! నువ్వూ నీపెళ్ళామూనూ !

కు—నా పెళ్ళామేమిటండీ, నాన్నగారూ !

ప—నీపెళ్ళామంటే నీపెళ్ళామే ! చెప్పలా, నీపెళ్ళామే.

కు—'నాపెళ్ళాం' అనేసంగతి మీారేమీా లోగడ అనలేదు కాదండీ, నాన్నగారూ !

ప—హారి, అదా! అవున్రోయ్, ఆసంగతి మరచిపోకూడదు. అదేమిటంటే, బాబీ, ఇప్పుడు పెద్ద ప్రత్యేకాస్తి అన్నానే, అది పెళ్ళితో కొట్టుకొస్తుంది, భార్య అనే భారంతో వచ్చిపడుతుంది. కాని, అందులో హెచ్చుతగ్గు ఏమీా ఉండదనుకుంటాను.

కు—అరె ! నన్ను నిర్ఘాంత.పడేటట్టు చేస్తున్నారే, నాన్నగారూ !

ప—ఏం ! ఓరిమూర్ఖుడా ! ఇంతలో ఏం ఉప్పె నొచ్చింది ! క్షణంక్రితం నువ్వు అంతా కృతజ్ఞతే, అంతా పితృభక్తేగదా ?

కు—అవును నాన్నా! మీరు అంతా స్వంతజమీ అన్నారు, ఐశ్వర్యం అన్నారేగాని, భార్య అనేమాట అన్న పాపాన్ని పోందే!

ప—అంటేం అనకపోతేంవోయ్, కుర్రపాడగట్టా! అదే జీవితంలో తమాషా! పెద్ద ఎస్టేటు ఎస్టేటుపళంగా కొట్టుగొస్తూంటే అందులో ఉండగల జీవధనం వద్దంటార్రా ఎక్కడేనానూ!

కు—అంత ఎస్టేటు నా సౌఖ్యంఖర్చుపెట్టి కొనుక్కో వలిసిన అగత్యం వస్తే, నేను మెల్లిగా ఆ బేరం రద్దుచేసు గుంటానండి. సరిగాని, నాన్నా దయచేసి చెప్పండి, ఆ అమ్మాయి ఎవరు?

ప—ఆఁ ఎవత్తో ఒకత్తె! ఆగోష నీకెందుకోయ్ సంతా! ఆపిల్లని ప్రేమిస్తాననీ, తక్షణం పెళ్ళి ఆడతాననీ, వాగ్దానం పారెయ్ చాలు.

కు—ఇదెక్కడి సబబండీ, నాన్నగారూ! నేను ఏమీ ఎరగని యువతిగురించి నా ప్రేమభావాలకి సమనులు పంపి పిలిపించనా?

ప—పోదూ! నువ్వు ఏమీఎరగని యువతినిగురించి ఆటంకాలు చెప్పడం మరీ బేసబబని నానమ్మకం.

కు—అల్లా అయిన పక్షంలో, విడమర్చి చెప్పేస్తాను, నాన్నా! నాదృష్టి మరొకరికేసి తిరిగిపోయింది. నాహృదయం ఒక అప్సరసకి కట్టుబడి అయిపోయింది.

ప—అదోటా! అయితే, నీహృదయాన్నే ఒక క్షమాపణ పంపించమను; చాలా బాధగానే ఉంటుంది, ఉం

డడం. ఉంటేం, వ్యవహారం చెడిపోయే టప్పుడు నీహృదయం అన్యులనించి మళ్ళగొట్టాలి.

కు—నా శపథాలు ఆపిల్లదగ్గిర తాకట్టెట్టేశాను, నాన్నా !

ప—ఆశపథాలమీద హక్కు వదులుకోమని ఆపిల్లతో చెప్పు బాబీ! వదులుకోమను. ఆ తాకట్టుకి వదిలిపించుగో వలిసినంత విలవలేదు. పోనీరా, తాకట్టు వాకట్టు అయిపోయిందను. అదీగాక, ఆ అప్సరసతాంబూకు శపథాలు నీదగ్గిర తాకట్టుంటాయిగా! మొత్తంమీద లాభనష్టాలుండవ్ !

కు—క్షమించాలి, నాన్నగారూ! చివరమాట చెప్తేస్తున్నాను. ఈ ఒక్కవిషయంలోనూమాత్రం మిమ్మల్ని శిరసావహించను.

ప—ఆఁ. ఏంరోయ్, బాబీ! కొంతసేపణ్ణించి నిన్ను ఓపికగా వింటున్నాను. నేను నిబ్బరంగా—చాలా నిబ్బరంగా, ఉంటున్నాను. కాని, జాగర్త! కబడ్దార్ ! ఎంతటివాడికి ఖస్సుబుస్సులు లేనప్పుడు, నాఅంత మెత్తటివాడుండడు, నన్ను ముక్కుకి తాడేసితీసుగుపోవచ్చు—ఏది, నాయిష్టం చెల్లనిస్తే! కాని, ఇక నన్ను వెర్రికోపంలో పడగొట్టకు.

కు—అయ్యా, రెట్టించి చెప్పవలిసొచ్చింది—ఈ విషయంలో మిమ్మల్ని శిరసావహింపజాలను.

ప—నేను నరకానికిపోయినట్టు—నాకంఠంలో ప్రాణం ఉండగా నిన్ను మళ్ళీ 'బాబీ' అని పిలిస్తే! కాస్కో !

క—అది కాదండీ, నామాట వినండీ!

ప—ఏమరొయ్యాయ్, నీమాట విననయ్యా! ఒక అక్షరం వినను. ఒకటంటే ఒకటీవినను. విననంటే వినను. ఏం. ఇః హీః...అందుకని ఛాబీ—ఛీ, కాదు కాదు. ఓరి కుక్క—గా! మాటలువద్దు. నీ వాగ్దానం తలసంజ్ఞతో చెయ్యి—లేకపోతే చూస్కో—.

క—ఎల్లాగండీ నాన్నగారూ, వాగ్దానం! ఎవరో నస్మరంతి అవకరపు పోగుని ముడెట్టుగుంటానని!—

ప—ఏమంటావోయ్ అబ్బాయి! ఆ అమ్మాయి నా చిత్తంవచ్చినంత అవకరంగా ఉండేటట్టు చూస్తాను. ఆ అమ్మాయికి చెరోభుజంమీదా చెరో మూపురం ఉంటుంది. ఆ అమ్మాయి చంద్రవంకలా టింకరగా ఉంటుంది. మళ్ళీ మాట్టాడితే ఆ అమ్మాయికి పోగామిగిలిన ఒఖ్ఖ కన్నూ గిర్రున చక్రంలా తిరుగుతుంది. (పళ్ళు బిగించి చేతివేళ్ళు పిసుగుతూ) ఇంకా కావాలంటే, ఆ అమ్మాయికి ఒళ్ళు చమురు కారుతూండి, గడ్డంకూడా ఉంటుంది. ఇంత చందంగానూ ఆ పిల్లఉండగా, చూసుగో నాతడాఖా, నువ్వు ఆపిల్ల కోసం పగలంతా సైట్లుకొడుతు కూచునేట్టున్నా రాత్రల్లా మేలుకుని ఆ అందంమీద ప్రణయగీతాలు రాసేట్టున్నా నేను చెయగల్ను ఏమనుకున్నావో! నక్క—పోతా!

క—ఆహాహా! ఇదే నిజంగా హేతువాదమన్నా మితవాదమన్నానూ!

ప—ఒరేయ్, జాగిలం, నిరసన వద్దోయ్, ఒరేయ్ కోతీ ఇకిలింపు వద్దోయ్!

కు—వినోదం ఆనందించడానికి నాజీవితంలో ఇంత కంటె అపసందర్భం ఎప్పుడూ రాలేదండి.

ప—ఛీ అబద్ధం? నువ్వు లోపలలోపల కులుకు తున్నావ్. అవున్రా, నే పోగానే నువ్వు కులుకుతావురా, కులుకుతావ్!

కు—నా విధి నాకు అంతకంటె బాగానే తెలుసు నండి.

ప—వద్దమ్మా ఆగ్రహం వద్దు. లాభం లేదబ్బీ, ఉద్రేకం లాభంలేదు. నాదగ్గిర నీపప్పు ఉడకదు, నాదీపూచీ.

కు—ఏమోనండి, ఇప్పుడంత నిబ్బరంగా నే నెప్పుడూ ఉండిఎరగను.

ప—ఛీ ఊరుకో, అది మరీ కంగారబద్ధం. నీ హృదయం ఉద్రేకంగా ఉండడం నాకు తెలియకపోవడ వేమిటోయ్! వేషాలకుక్కాకాన! నాదగ్గిర అవి చెల్లవురా!

కు—కాదండి. ప్రమాణంగా—

ప—అదుగో అదుగో! రేగిపోతున్నావ్. నాకు మల్లే నిదానంగా ఉండలేవ్? దిక్కుమాలి ఉద్రేకంవల్ల వచ్చిపడే పాడులాభం ఏముంటుంది? ఉద్రేకంవల్ల ప్రయోజనం లేదురా, సిగ్గుమాలిన నిర్మోహమాటపు పొగరుబోతు వెకిలికుంకా!—అదుగో, అదుగో మళ్ళీ నీ నిరసన. నన్ను రెచ్చగొట్టకు, చెబుతున్నాను. నా స్వభావంలో శాంతత్వం నువ్వెరుగుదువ్ కుంకవి, నా వినయమూ ఎరుగుదువ్ బోడివి, అవి ఆధారం చేసుగుని ఆడుతున్నావ్ ఆట. జాగ్రత్త

రా నక్కా. ఋషిలాంటివాడికికూడా శాంతత్వం ఎప్పుడో పోతుంది. గమనించు. ఇది ఆలోచించుకోడానికి నీకు ఆరు గంటలన్నర టైమిచ్చాను. ఆ కాలపరిమితిలో నువ్వు నేను ఏంచెయ్యమంటే అది, బేషరతుగా చెయ్యడానికి సంసిద్ధుడవు కావడానికి అంగీకరిస్తే, పోనీఅని చెప్పేసి, క్రమక్రమంగా నేను నిన్ను క్షమించవచ్చు. ఇక అంగీకరించవూ! ఛా సైతాన్ ఛా! నేను దక్షిణార్ధగోళంలోఉంటే నువ్వు ఉత్తరార్ధగోళంలోకి లేచిపో! అసలు మరోస్థలం వెతుక్కుని భూమి ఖాళీచెయ్! నే పీల్చేగాలి పీల్చను, పీల్చావా యంత్రమెట్టి బయటికి లాగించేస్తాను. నే వాడుకునే వెలుతురు వాడకు. వాడావా, చీకటిపంపించి వెలుగు లాగించేస్తాను. నీ భూమి వేరు, నీ గాలి వేరు, నీ వెలుగు వేరు. ఛా బిచ్ఛా ఛా. నీ బోడికమిషను ఉద్యోగం ఊడపీకించేస్తాను. అప్పుడు మళ్ళీ తమకి బువ్వ కావాలికాదూ, బువ్వా! తన్నిమిత్తం ఓ ధర్మసంఘం వాళ్ళచేతికి అయిదణాలకానీ ఇస్తాను. ఆ వడ్డీమీద నువు జీవిస్తుగాని. నువ్వు నావాడవుకాదు పొమ్మంటాను, నీ వారసత్వం రద్దుచేస్తాను, నాకు వీడు జనించలేదు పొండంటాను. ఒట్టు జాగర్త మళ్ళీ 'బాబీ' అని పిలవను! (అంటూ R F కి గబగబా వెళ్ళిపోతాడు.)

కు—ఆహా! నాన్నగారినెమ్మది, మార్దవం, విచారణా! ముద్దువస్తున్నాయిగదా! ఇల్లాంటివిషయంలో తమ అభిప్రాయం వెలిబుచ్చడానికి ఎంత కోమలపద్ధతి అవలంబించారూ! నేను నా యథార్థం వారితో చెపితే ప్రమాదమే,

ఎవత్తినో సొమ్మున్న ముసలమ్మని నాకు ప్రసాదించాలని గావును, ఈయన ఊహ. తనుమళ్ళీ చిన్నప్పుడు ప్రేమించే పెళ్ళాడాడు. పెద్ద గ్రంథసాంగుడు, కులాసా సరసుడు. (అని తల పంకించి) సరే!

[ఆలోచనలో కళ్ళుమూసుగుని, ఎదరబల్లమీద
మోచేతులాని తల పట్టుగునిఉంటాడు]

ఆ—(R F నించి వచ్చి) అయ్యగారండి! మీ నాన్న గారు వెడుతూ నన్నూ మన కుక్కనీకుడా బాదేశారండి.

కు—టట్ పో! (అని మళ్ళీ అల్లానేఉంటాడు.)

ఆ—(R F కి జరిగి) నాన్నగారు తనమీద కోప్పడితే, వీరు నామీద ఇద్దై పోతున్నారు. నేనెళ్ళి గేటుదగ్గిర కుర్రాణ్ణి చావదంతాను. (అని R F కి)—(రెండవ తెర పడుతుంది.)

ఉ—(L F నించి వస్తూ) అబ్బబ్బ ముసలమ్మ శృంగారం మరీగానచ్చింది. దేవయ్యగారికి ఉద్వాసన చెప్పేసింది. ఇప్పుడు మా కల్పకంగారికి మరో కొత్తవరుడుట—కుమారసేనంగారు. రుసుమిచ్చి దరఖాస్తు నాద్వారా పెడితేనేగాని నేను ఆపేరు వరుళ్ళజాబితాలో ఎక్కించుగోనే ఎక్కించుగోను. అందరికంటె, ఈ జ్వాలారంగంగారు తెలివిమద్దెపుఘటం. ముసలమ్మో ఉత్తరాలురాసి హంసాదేవి అని సంతకం చేస్తోంది. రాస్తున్నది కల్పకంగారే అని జ్వాలారంగం ఊహ. అదుగో! (సన్నంగా) ఏమండోయ్! ష్! ఇల్లాయిల్లా!

[జ్వాలారంగం R F నించి వస్తాడు]

జ్వా—ఇదుగో, ఉళక్కీ! కనబడలేదే! నేను అర గంటనించి దక్షిణమైదానంలో నీకోసం తిరిగాను.

ఉ—అయ్యో ప్రేమదేవుడా! నేను మీకోసం ఉత్తర మైదానంలో కాసుగు కూచున్నాను.

జ్వా—బహుశః అందుకనే మనం కలుసుగోలేక పోయాం. నువ్వు ఊరికే రావు, ఏం తెచ్చావ్?

ఉ—చిన్న ఉత్తరం.

జ్వా—ఏదిఏది? ఏమంటుంది నా ప్రేమకూన!

ఉ—ఇదిగోనండి! (అంటూ ఒక ఉత్తరం ఇస్తుంది.)

జ్వా—(పుచ్చుగుని చదువుతాడు) ''నా హృదయ రంగానికి ఆలంకారికమైన జ్వాలారంగానికి! సత్యప్రేమాతి రయానికి జంపతులు చరస్థాయిగా ఏకదేశాన్వయ సహ వాసము చేయనక్కర్లేదు. పెక్కు ఇక్కటలలో తక్షణ జన్యమై జ్వాలాభూయిష్ఠమైన ఉత్కృష్ట ప్రేమయొక్క ఉద్వృత్త ప్రభావం అంతకంటె ఎక్కువగా ఉంటుంది. జ్వాలారంగంగారి స్థూలరూపంయొక్క దూరదర్శిని నాకు లభించగానే నా హృదయకుళీరంలో అరకం చిత్తవృత్తులు పొడలు చూపించాయి!

—హాఁగ్! ఎంతబాగుందో! ''సహజంగా స్త్రీ వాచకాన్ని అయి ఉండడంవల్ల మరిరాయడం, భోజ్యం కాదుకాని, ఈ ఒక్కమాటూ రాయకుండా ఆగలేను.—అప్ర

మేయమైన నా ప్రేమతర్పణముతో ప్రేమింపదగిన ఏక లభ్యుడు ఒక్క జ్వాలారంగమే అనే అర్హత అతడు సంపాదిస్తే నాకు అనితర లభ్యమైన ఆనందకందం లభిస్తుంది—ఇట్లు, హంస.'' ప్రమాణంగా చెబుతాను ఉళక్కీ— మీ యజమానురాలు భాష ఆపోశనం పట్టేసిందిస్మీ.

ఉ—అవేం మాటలండీ!

జ్వా—ఏంమాటలా! నీరాణి కేవలం సరస్వతి—నిఘంటుకికూడా రాణి! ఆవిడకి మాటలు పిలిస్తేపలుకుతాయి, మూలమూలవికూడా!

ఉ—లెక్ఖేమిటండీ, అంత అనుభవంగల ఆవిడకీ!

జ్వా—అనుభవమా? పదిహేడేళ్ళేగా!

ఉ—అవునంషోయ్! అయినా తెగచదివి పారపోసింది! చూడకుండాకుడా చదవగల్దు.

జ్వా—ఎనోగాని, మాటలచేత మరీ చాకిరీ చేయించేస్తోంది, బలవంతాన్ని తెచ్చి.

ఉ—అస్తమానమూ మీ స్మరణే!

జ్వా—నేను ఆదర్శభర్తనని సిఫార్సుచెయ్యి. ఇదుగో (అని ఒకనాణెం ఇస్తాడు.)

ఉ—చిత్తం. (అని పుచ్చుగుంటుంది.)

జ్వా—(L F కి నడిచి వెళ్ళబోతూ గాలిలో ముద్దు పెట్టుగుంటూ) ఈ ముద్దు పట్టుగెళ్ళి ఇయ్యి!

ఉ—ఇయ్యంది పట్టెగెళ్ళనా! అబద్ధా లాడమన్నారా!

జ్వా—ఆసి సక్కా ! (అని దగ్గిరికి రాబోతాడు.)

ఉ—ఆగండాగండి. ఇటునించి ఎవరో వస్తున్నారు. (అని R F కి చూపెడుతుంది.)

జ్వా—(L F కేసి గబగబా తోకముడుస్తాడు.)

ఉ—అమ్మయ్య ! వదిలాడుబాబూ !

ఆ—(R F నించి చొరబడి వట్టి తుపాకీ తెచ్చి గురెట్టి) ఆగు !

ఉ—బాబో ! (అని ఆగి) చచ్చిపోయాను !

ఆ—నా కింతకోపం వచ్చినప్పుడు, దారికి అడ్డుఎందు కొచ్చావ్ !

ఉ—నువ్వని తెలియక !

ఆ—వాడికి ఉత్తరం ఇచ్చావా లేదా ?

ఉ—ఇచ్చాను.

ఆ—అంటే చచ్చావన్నమాటే, కాస్కో.

ఉ—ఉండవయ్యా, తొందరా ! ఆ ఉత్తరం ముస లమ్మగారు రాసింది. ఆవిడికి ఈ జ్వాలారంగాన్ని చూసేసరికి మతోయింది.

ఆ—చిత్రంగాఉందే! ఆవిడ కూచునే కిటికీదగ్గిర్నించి నేనూ వెళ్ళాను చాలసార్లు !

ఉ—మరి, తుపాకీ తీసెయ్ !

ఆ—ఫరవాలేదు, ఇది వట్టిదే, బెదిరింపుదే !

ఉ—అయితే మరి అసలువార్త చెప్పమన్నావా ?

ఆ—వార్తా ? చెప్పు.

ఉ—మీ వసంతంగారు ఇక దయచెయ్యొచ్చు పెందరాళే !

ఆ—ఏం కథా !

ఉ—దేవయ్యకంటే పెద్దశత్రువు వచ్చివడ్డాడు.

ఆ—ఎవడూ ?

ఉ—కుమారసేనంట! పరాంకుశంగారు తన కొడుక్కి కల్యాణాన్ని మాట్లాడారట !

ఆ—(చిరునవ్వుతో) నిజమే !

ఉ—ఆ. గోడచాటునించి విన్నాను.

ఆ—(సంతోషంతో) ఆహాహా ! ఉళక్కీ ! సెలవ్, నే పోవాలి.

ఉ—నీకు నవ్వులాటగా ఉందిగాని, మీవసంతంగారి పని ఏమవుతుందోగదా !

ఆ—ఏదో ఏడుస్తాం.

ఉ—ఆయన్ని కుంగిపోవద్దను.

ఆ—ఫరవాలేదు ఫరవాలేదు.

ఉ—కుమారసేనంమీద ఓతడాఖా తియ్యమను.

ఆ—సరేలే నువ్వు వెడుదూ ! (అని చిటికెలువేస్తూ పాడుతూ కళ్ళుమూసుగుని గంతులు మొదలెడతాడు)

ఉ—(R F కి పోతూ) అయ్యో ఘటమా ! నవ్వుతాడేం ఏడవకా! మగజాతి లక్షణం గావును! (అని గబగబా వెళ్ళిపోతుంది)

కు—(వాడల్లా ఉత్సాహంతో ఆడుతూండగా L F నించి పిస్టలు బారుచేసి వస్తూ) ఏయ్! ఆగు!

ఆ—(వచ్చిం దెవరో గమనించకుండా తన పిస్టలు బారు చెయ్యబోతూ వచ్చినవాడు కుమారసేనం అని గ్రహించి, పిస్టలు వాల్చేసి నుంచుంటాడు)

కు—అది నీమీదే బారెట్టి పట్టుగో!

ఆ—ఇది బెదిరింపురకం పిస్టలండి!

కు—అయినాసరే!

ఆ—చిత్తం (అని కోరినరీతిగా పట్టుగుంటాడు)

కు—నీ అల్లరికీ నీ యజమానినైన నా మనఃక్షోభ నువ్వు గ్రహించనందుకూ, నిన్ని తక్షణం ధాంమని పేల్చేస్తాను.

ఆ—(చిరునవ్వుతో తయారుగా నిలబడుతూ) ఓ సిద్ధం, పేల్చండి. మీరే విచారిస్తారు తరవాత!

కు—విచారిస్తానూ!

ఆ—అవును. ఆఖరుమాటా వీడినోటంట విని తరవాతే పేల్చేసి ఉండవలిసిందికదా, అని.

కు—ఏమిటామాటా?

ఆ—చెప్పనా?

కు—త్వరగా చెప్పకపోయినా పేల్చేస్తా!

ఆ—మీనాన్నగారు మీరు పెళ్ళిచేసుగు తీరాలీ అని మిమ్మల్ని కోప్పడుతున్నారే, ఆపిల్ల మన కల్పకం గారేట! ఇప్పుడే ఉళక్కి చెప్పింది.

కు—నిజమే !

ఆ—నిజమేనండి. అది వింటిట ఒట్టెట్టుగుంది.

కు—అయితే రక్షించావ్! నిన్ను పేల్చేశానుకాను, నయమే !

ఆ—ఎందుకుపేలుస్తారూ ! నాప్రాణం మీరేకదండీ !

కు—ఆకాశం ! ఎంతమాటన్నావురా ! నీప్రాణం నేనయితే, నాశరీరం నువ్వు ! ప్రస్తుతం ఇదుగో (అని జేబులోంచి సొమ్ముతీసి ఇస్తాడు)

ఆ—(పుచ్చుగుంటూ) ఇల్లాంటివారు ఎక్కడ పేల్చగలరండీ !

కు—నడు నడు. నాన్నగారికి క్షమాపణ చెప్పడంగురించి తయారుకావాలి. రా, రా (అని ఉత్సాహంతో R F కి నడిచిపోగా, ఆకాశం అంతకంటె తీవిగా సొమ్ములెఖ్ఖ చూసుగుంటూ వెనకాల వెడతాడు). (తెర)



## రంగం-3

[రెండవ తెరఎదట పరాంకుశం బస. వీధిగది.
ఒక టేకుర్చీ L F కేసి ఖాళీగా ఉంటుంది.
R F నించి కుమారసేనం వస్తాడు]

కు—నాన్నగారు లోపలికి వెళ్ళినట్టున్నారు. మా ఆకాశం చెప్పింది అక్షరాలా నిజం. నేను ఏయువతిని లేవ తీసు గెళ్ళదల్చానో ఆయువతినే నేను పెళ్ళాడితీరాలని మా నాన్నగారి బలవంతం. ఈయనికి అసలుసంగతి అప్పుడే తెలియకూడదు. ఈయన ఓఘాయిత్యపు మనిషి, ఒక్కొక్క ప్పుడు ఏదోఓటి చేసేస్తూంటాడు. నా ఉపసంహారం మొద లెట్టాలి. ఇంత త్వరలో వీడిమతం ఎల్లామారిందిరా అని ఈయనికి సందేహం వెయ్యకుండా నాధోరణి యావత్తూ మనఃపూర్వకమే అనిపించేలట్టు చెయ్యగలనని నాధైర్యం. అదుగో నాన్న వస్తున్నారు! మాచెడ్డ కయ్యాలీగా ఉన్నారు. (అని R F కి తప్పుగుంటాడు)

ప—(L F నించి మెల్లిగా నడిచివస్తూ) ఛీ. వాణ్ణి చూస్తే క్షమించను. (ఆగి) చావడమనా, అన్నాను. అబ్బే, ఎంతమాత్రమూ చావను! సరిగదా, మరో యాభై యేళ్ళు జీవించి, వీణ్ణి పీడించుకుని తింటాను. ఇందాకా వాడి పొగరు మోత్తనం చూస్తే నానిబ్బరం అంతా చెడిపోయింది. వాడి పెంకితనం, వాడి ఆగ్రహం, వాడి మొండిపట్టూ! అబ్బ!

తనమాటే తనది. ఎక్కణ్ణించొచ్చిందో వీడికీపోలిక! తొలి కానుపుగా కన్నందుకూ, పన్నెండోయేటే సైన్యంలో జేర్పించినందుకూ, తిన జీతం అల్లాడుండగా అప్పణ్ణించీ సాలుకి ఓ యాభై నవరసులు వాడికి పంపినందుకూ, వాడు నాకు ముట్టచెప్పింది ఇదీ! సరేసరే. నాకూ వాడికీ చెల్లూ! వాడు ఎవళ్ళబ్బాయో నాకు తెలియదు పొమ్మంటాను. మరి ఇక వాణ్ణి చూడను, ఛస్తేచూడను, సనేమిరాచూడను.

కు—(R F నించి వచ్చి బుర్రవంచుగుని విచారంగా నుంచుంటాడు.)

ఏ—ఎవడ్రా ఆ భడవా! పోపో అవతలకి పో.

కు—అయ్యా! తమఎదట ఒక పశ్చాత్తప్తుణ్ణి చూస్తున్నారు.

ఏ—నా ఎదట ఒక పెంకిలుచ్ఛాని చూస్తున్నాను.

కు—కాదండి. త్రికరణాలా పశ్చాత్తప్తుడైనవాణ్ణి చూస్తున్నారు. నేనండి, నాతప్పు తమఎదట ఒప్పేసుగుని, మీ యిష్టానికి పూర్తిగా లొంగిపోయే ఉద్దేశంతో వచ్చానండి.

ప—ఏమిటదీ?

కు—లోగడ మీరు నాకు కనబరిచిన మంచితనమూ దాక్షిణ్యమూ దీనవాత్సల్యమూగురించి నాలోనేను ఆలోచించుగుని, యోచించుగుని, విధవిధాల తలపోసుగుంటూ ఉంటున్నానండి.

ప—అల్లానుటండీ ? మరి ?

కు—మరి, అదేరీతిగా మీరు దయతో సెలవిచ్చిన పుత్రధర్మమూ, శిరసావహింపూ, జనకాధికారమూ మొదలైనవి సమంగా సర్ది ఏకొమ్మూ మొగ్గుకాకుండా నిదానంగా ఉండేలాగ చూసుగున్నానండి.

ప—మరేమిటిరా, కుక్కపిల్లకాన !

కు—మరేమిటాండీ ! మీకు సంపూర్ణతృప్తి కలిగే లాగు నాయొక్క ప్రతి ఆసక్తినీకూడా బలివేసెయ్యాలనే దృఢనిశ్చయం చేసుగున్నానండి. ఇదండి నా ఆలోచనల ఫలితం !

ప—బుద్ధి అంటే ఇదుగో ఇల్లాఉండాలి. అందు లోనూ కేవలంబుద్ధి. ఇంతకంటె బుద్ధిగాఉండేమాటలు నాజన్మలో విన్లేదు. ఆరి నీకంగారు బంగారంగానూ ! మళ్ళీ నిన్ను 'బాబీ' అని పిలుస్తాను, బాబీ !

కు—ఆ బిరుదుకి నేను సంతోషపడుతున్నాను.

ప—హారి బాబీ ! వెర్రిబాబీ, నా చిట్టిబాబీ, ఇప్పుడు చెబుతాను విన్నా, అమ్మాయి నిజంగా ఎవరైందీనూ! దిక్కుమాలి ఉద్రేకమూ దార్ఢ్యమూ వెడలగక్కే కొంటె కుంకవై పోయావుగాని, లేకపోతే నేను మొదటే ఆసంగతి చెప్పేసి ఉండేవాణ్ణి. చెప్పేస్తున్నా కాస్కో బాబీ, అద్భుతం ! సిద్ధంగాఉండు బాబీ, ఆనందం ! చెప్పేస్తున్నా. కల్పకం ! కల్పకంగురించి ఏమంటావ్ ?

కు—కల్పకమాండీ ! వాళ్ళది జాజినగరమాండీ ?

ప—జానకిమిత్రా, వాజమ్మా! కిందనమాటు, నువ్వు మీ ప్రస్తుత దశలోకి జేరాలని పైనించి కాగితం రాక పూర్వం, మన ప్రాంతాలకి వచ్చారెరగవుత్రా, రాంభాణమ్మ అనే ఆవిడానూ, ఆవిడ మేనగోడలు కల్పకమూనూ!

కు—రాంభాణమ్మా! కల్పకమా! ఇదివరలో ఇలాంటిపేర్లు విన్నట్టే నాకు జ్ఞాపకంలేదండీ! అయినా ఉండండి, ఉండండి—ఏదో కొంచెం జ్ఞాపకం వస్తానంటోందీ! ఆఁ ఆఁ కల్పకం, కల్పకం! ఆ అమ్మాయికి మెల్లకన్ను కాదండీ? ఇల్లా చూస్తుందీ! తల తుప్పలా ఉంటుందీ?

ప—మెల్లకన్నా? తుప్పతలా? ఛ, ఛ. ఎంత మాత్రం కాదు.

కు—అయితే, నేను మరిచిపోయుండాలి. ఆవిడ మరో అమ్మాయి అయిఉండాలి.

ప—(కులాసాతో) ఒరేయి బాబీ, బాబీ! ఎల్లాంటి పిల్ల అనుకున్నావ్. మిసమిసలాడుతూ ప్రేమ చిమ్ముతూ పదిహేడేళ్ళ ప్రాయంలో ఉంది!

కు—అటువంటి ధోరణితో నాకేమీ నిమిత్తం లేదండీ, ఎట్లాఉన్నాసరే. ఈవిషయంలో మిమ్మల్ని నేను సంతోషపరచగలిగితే అదే నాకు వెయ్యివేలు.

ప—కాదుగాని, బాబీ, ఆ పిల్లనేత్రాలుంటాయి! ఓహోహో! ఏమినేత్రాలు అవేమినేత్రాలూ! ఆ అమ్మాయిక సహజత్వం, ఆ మొగమాటపు చపలత్వం! (లక్క) ఒక్కచూపు ఇల్లా విసరడంలోనే మనస్సు చెప్పేసిందన్న

మాట, ప్రేమభావాల్ని ప్రజ్వలింపచేసిం దన్నమాట! ఇక బాబీ నువ్వు చూడలేదుగాని, చెక్కిళ్ళున్నాయి ఒరీ చెక్కిళ్ళూ! ఔర! ఎర్రని ఎరుపు—చాడీకోరు నేత్రాల అన్యాపదేశాలకి సిగ్గు పేరుకున్నట్లు! కాని అంతకంటె ఆ పెదవులు బాబీ ఆ పెదవులు! ఆహాహా! వాటి మాట ప్రజ్ఞకి అవి సంతోషిస్తూ ఉంటాయి. సంతోషం కాకుండా ఇల్లా ఉంటాయనుకో అదోతమాషా, చిరికోపం అనుకో అప్పుడు ఇంకో తమాషాగా ఉంటాయి!

కు—(తనలో) అమ్మ ముసలినాన్నా! కల్పకాన్ని చిత్రించేశాడే!

ప—ఆ కంఠం ఉంది, బాబీ!

కు—సరేగానండి నాన్నా, ఇప్పుడు నేను ఒప్పుగో వలిసింది ఆ మేనత్తా లేకపోతే ఆ మేనకోడలా?

ప—మేనత్తా! హారి రాతిగుండెకానా! గాడిది బుద్ధిపయ్యా! ఛీ అవతలికిపో! నిన్నుచూస్తే అసహ్యం వేస్తోంది. నీ యీడప్పుడు నేనుగాని ఇల్లాంటి వర్ణన వినుంటే, అక్కడికి తారాజువ్వలాగ ఎగిరి వెళ్ళి ఉండేవాణ్ణి! మేనత్తే మిట్రా నీమొహం! మీ అమ్మని నేను పెళ్ళాడేకాలంలో, ఈ మేనత్తలాంటి ముసిలిబరుగుకి ఓమహాసామ్రాజ్యం పసుపు కుంకంగా ఇస్తాం చేసుగోండని ఎవరేనా నన్ను కోరిఉంటే, దణ్ణంపెట్టి నేను మానేసి ఉండేవాణ్ణి.

కు—మీనాన్న మిమ్మల్ని కోరుంటే, ఆయన్ని సంతోషపెట్టడం మానేసి ఉందురా?

ప—సంతోషపెట్టడమా ! మా నాన్ననా ! ఆరి కుంకా ! అదా ! మా నాన్నే గనక కోరిఉంటే, ఆదారి వేరులే, ఆదారి వేరు ! ఏమయేదో ! ఎంచేతంటే, నాఅంత సౌమ్యం అయిన తండ్రికాదు, బాబీ, మాతండ్రి !

కు—కావున్లెండి.

ప—అయితే బాబీ, నీను కాబోయే పిల్ల అంత అందంగా ఉన్నందుకు నువ్వు దుఖంగాలేవుకద కొంపతవ్వి !

కు—అయ్యా ! రెట్టించి చెబుతున్నాను. ఈ విష యంలో మిమ్మల్ని సంతోషపరచడం ఒకటే నాకున్న కోరిక. పెళ్ళికూతురు అందంగాఉన్నా ఫరవాలేదుగానండి, తమరు దయచేసి జ్ఞాపకం తెచ్చుగుంటే, ఆ అమ్మాయికి ఒకటో రెండో గూనులుండడం, కన్ను ఒకటేఉండడం, ఇంకా కొన్ని విలాసలక్షణాలుండడం తమరు లోగడ సూచించారు. పెళ్ళికూతురు మరీ సుందరంగా లేకపోతే పీడాపోయిరి గానండి, నేను ఎన్నుకోదల్చినపిల్లకి నియమితసంఖ్యప్రకారం ఇంద్రియాలూ, గూనులాటివి లేకుండా మితంగా ఉండేవీవ్రూ ఉండడమే నయమని నేనంటాను. ఒక్కొక్క ఏకాక్షి కూడా ఆకర్షణీయంగానే ఉండవచ్చుకానండీ, పిల్లకి రెండు కళ్ళూకుడా ఉండాలనే వ్యామోహం జనంలో వ్యాపించి ఉండడంవల్ల ఆ దినుసుయొక్క ప్రత్యేకత్వంగురించిన క్షేమజం నేను కోరుకోను.

ప—అరే ! ఎక్కడా ఉద్రేకమే లేదే శ్లేష్మజాతి వాజమ్మకి ! వొత్తి సన్యాసిఘటంలా ఉన్నావేమిట్రా ! హారి

విషపురాతి బ్రాహ్మా! నువ్వురా యోధుడివి!—ఛీఛీ! పో. నువ్వు నడక నేర్చిన కర్రముక్కవి. నువ్వు సోల్జర్ల వేషాలకి దుమ్ము దులపడానికి పనికొస్తావు. అయ్యో బతుకు! జాగర్తగావిను. ఆ పిల్లని పెళ్ళాడాలని నాకే ఉందిరా, తేభ్యం!

కు—అయ్యా! తమకు పరమవిధేయుణ్ణి. మీచిత్తం ఎల్లాగో అల్లాగే. కల్పకాన్ని మీరే వివాహం ఆడదలిస్తే, ఆ మేనత్తని నేను పెళ్ళాడవలిసిందిగా మీరు నన్ను కోరతారని భావిస్తాను. ఓ భేషుగ్గా, లేక ఒకవేళ మీరు మనస్సు మార్చుగుని ఆ మేనత్తనే వరించారా—మీరు చెప్పింతరవాత నాకు ఎవరైనా ఓ శేసుమండీ—నేను ఆ మేనగోడల్ని కట్టుగుంటాను.

ప—(చిరునవ్వుతో) అమ్మఅమ్మ! అమ్మ బాబీ! నువ్వు పరమలుచ్ఛావి అయిఉండాలి. అవునురా! నాకు తెలియదుట్రా నక్కా, ఈ విషయంలో నీ నిర్లక్ష్యం అంతా కేవలం అబద్ధం—అబద్ధం భడవా, అబద్ధం! ఊఁ, ఒప్పేసుగోరా బాబీ, ఒప్పేసుకో! ఆడావుఅబద్ధం! వేస్తున్నావు పుంఢాకోర్ వేషాలూ! ఒప్పుగో! ఏఁయ్! ముసిల్దాన్ని కట్టుగుంటావేం? ఛీ నీఅబద్ధం ఒప్పుగో, నీ లుచ్ఛాతనం ఒప్పుగో, లేకపోతే నిన్ను ఏంజేసిపోతానో చూడూ!

కు—నాన్నగారూ! నా పితృభక్తి గురించీ నా విధ్యుక్తధర్మం గురించీ మీరు పొరపాటు పడుతున్నారని చెప్పడానికి చాలా చింతిల్లుతున్నాను.

ప—(నవ్వు మొహంతో) పోవోయ్, పితృభక్తి లేదు. పుత్రధర్మమూ లేదూ—సింగినాదం! రా, నాంగోటిరా. ఆ రాంభాణమ్మకి ఓ చీటీ రాసిస్తాను, ఆపిల్లని నేరుగా వెళ్ళి చూసెయ్. ఆనేత్రాలు నీలో ప్రథమప్రేమ జనింపజేసే జ్యోతులవుతాయి! రా, రా. అక్కణ్ణించి వెనక్కి రావడంలో నీకు పూర్తిగా పిచ్చెత్తకపోయినా, పరమానందం కలగకపోయినా. తొందర పుట్టకపోయినా, నిన్ను ఎంత మాత్రం క్షమించను, బాబీ, క్షమించను. చూసొచ్చీకుడా ఆపిల్లని నువ్వు చేసుగోనంటావా, నీకర్మం, నేనే పెళ్ళాడేస్తాను, ఏమనుకున్నావో! (అంటూ లేచి, ఎంతో ఉత్సాహంగా, నవ్వుతో, L F కి గబగబా వెళ్ళిపోతాడు, వెనకాలే, తల ఊగిస్తూ కుమారసేనం వెడతాడు.)

[రెండవ తెర లేవగా, రాంభాణమ్మ ఇంటిహాలు, రాంభాణమ్మ RM నించివచ్చి LM కి వెడుతుంది. వెనకాలే, చేతులో ఒక చిన్న చీటీపుచ్చుగుని గబగబావచ్చి]

ఉ—మామ్మగారూ! మామ్మగారు!

రాం—(LM నించి వెనక్కివచ్చి) ఏమే!

ఉ—ఇదుగోనండి (అని చీటీ యిస్తుంది.)

రాం—(కళ్ళజోడు తుడుచుగుని) ఎవరిచ్చారు!

ఉ—ఆ ముసిలాయనండి!

రాం—ఓహో! (అన్ని చదివి, చిరునవ్వుతో) కుమారసేనం వచ్చాడా?

ఉ—ఎవరో సడుచాయ నొచ్చాడండి! మంచి మిలిట్రీ బాబు!

రాం—వెళ్ళి లోపలికిరమ్మను (L F కేసి చూపించి) ఇక్కడ ఒక కుర్చీ వేసివెళ్ళు.

ఉ—(కుర్చీవేసి R M కి వెళ్ళగా, R F నించి కుమార సేనం వస్తాడు.)

రాం—రావయ్యా, సేనానీ! కూర్చో! పరాంకుశం గారి అబ్బాయివంటే చాలదుటయ్యా, నీకు వేరే శ్రీఫారుస్సు కావాలాఏమిటీ! అసలు నీరూపంలో ఉండే లసత్కారం చూస్తే, నిన్నుగురించి ఏమేమి అంటూంటారో సరీసుగా అల్లానే ఉన్నావు.

కు—బామ్మగారూ! క్షమించి ఒకమాట వినాలి. కల్పకంయొక్క దర్శనం కలగడం అనే భాగ్యం నా కింకా పట్టలేదుగనక, రాంభాణమ్మగారితో మైత్రి అనే గౌరవ మేనా నాకు దక్కుతుంది గదా అనే ఆశవల్లే ముఖ్యంగా ప్రేరేపింపబడి నేను వచ్చాను. రాంభాణమ్మగారి మేధా ప్రజ్ఞలూ, కోమలవైఖరులూ, సహజ పాండిత్యమూ గురించి వాగని నాలిక లేనేలేదు.

రాం—అయ్యా, ఇంత అమితగౌరవానికి నేను తగను. కూర్చోండని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

కు—(ఆ కుర్చీ మధ్యకిజరిపి ఆవిణ్ణి కూర్చోమనగా, ఆవిడ L F కి వెళ్ళి మరోకుర్చీ తెచ్చి అతనికి వెయ్యగా, కూర్చుంటాడు).

రాం—చూశారూ, అబ్బాయి! ఈకాలంలో స్త్రీల యొక్క మేధక లక్షణాల విలవ గ్రహించిన మొగాళ్ళే

లేరండీ! ప్రతీ ఇల్లాలికీ శాస్త్ర జ్ఞానమేనా అవసరమేమో గదా అని ఆలోచించే పురుషులే కనబడరూ! ప్రతీవాడూ అందంకావాలి అందంకావాలి అంటూ గోలేగాని, ఇతర వివేక్షణ లేందే ఎవరికీనూ!

కు—అమ్మా! తమరు సెలవిచ్చింది అక్షరాలా నిజం. కాని, నేరమంతా స్త్రీలదే అని నా ఊహ. తమరి అందంగురించి వచ్చే మెప్పు ఎంత గొప్పచేసుకుని గర్విస్తున్నారంటే, మరి తమరికి జ్ఞానమే అక్కర్లే దనుకుంటున్నారు. అందువల్ల, విలాసవనంలో పెంపుడు వృక్షాల్లాగ స్త్రీలు పువ్వుల డాబుతో ఉండడం, కాలక్రమాన్ని అవి వాడగా, మరి ఫలం లేకపోవడం! ఉభయతారకంగా ఉండగల వ్యక్తులు రాంభాణమ్మగారూ నారింజచెట్టూలాగ అక్కడక్కడ ఉంటారు.

రాం—అయ్యో! నీ ఆదర మర్యాదలు చూస్తూంటే, నాకు ధిగ్ భ్రమరం కలుగుతోంది. ఔరా! ఇతని మర్యాద! ఇతడు కేవలం మర్యాద మారేడులా ఉన్నాడు. అయితే, సేనానీ, నున్వారగపుకాబోలు! మా తలతిరుగుడుపిల్ల తన ప్రేమభావాలు యావత్తూ పట్టిగెళ్ళి ఒక ఉప్పదళవాయికి దాఖలుచేసేసింది. వాడు, ఓ నీచుడు, దిమ్మరి, పరహాస్యవేది. మేం ఎవరమూ వాణ్ణి చూళ్ళేదు, వాణ్ణిగురించి ఎవళ్ళకీ ఏమీ తెలియదు.

కు—ఓహో, అదాండీ! ఆ అభాజునుడి సంగతి నేనూ విన్నాన్లెండి. ఆ సంగతి కారణంగా నేను మీపిల్ల మీద కోపం పెట్టుకోదల్చుకోలేదు.

రాం—ఔర, సేనానీ! నీది ఎంత మంచితనం, ఎంత మంచి విచారం! ఆ సంగతి నేను అనువేషం చేసింతర వాత, ఎంత చెయ్యగల్తునో అంతా చేశానని నా నిశ్చయం. ఆ దిక్కుమాలి ఉపదళారీని ఈపిల్ల స్మరించనేకూడదని కఠిన మైన ఆకాంక్ష పెట్టేశాను. పైపెచ్చు, పరాంకుశంగారు ప్రతివాదించిన తైరుమానం పిల్లతో చెప్పేశాను. కాని, నేను జారీచేసిన ప్రతీ అభిజ్ఞాకుడా ఘృణీకరించడానికి ఈపిల్ల నిశ్చయం చేసుగుని ఉన్నదా అన్నట్టు, కనిపిస్తోంది—అని చెప్పడానికి చాలా పరిపతిస్తున్నాను.

కు—అమ్మా! నిజమే. అటువంటప్పుడు మీకు చాలా ఇదిగా ఉంటుంది.

రాం—అబ్బే! చెబుతే నమ్ముతావో లేదో అబ్బా యోవ్, నామనస్సు ఎంత క్షోభ పడిపోతోం దనుకున్నావ్! నేనుకుడా చివరికి ఆ నరాలఫిట్టులో పడేట్టున్నాను. ఈపిల్ల ఇక వాడితో వ్యహరించడం ఉపసంభారం చేసుగుందేమో అని పొరబడ్డాను. ఏమంటే, ఈవేళంటే ఈవేళ, ఆ పీనుగు దీనికి రాసిన ఉత్తరం ఒకటి అడ్డుకుని లాగేశాను. అదీ ఇక్కడే ఉండాలి. (అని, తడుముకుంటుంది).

కు—(తనలో) దిక్కుమాలికర్మం! నేరాసిన ఆఖరు చీటీ గావును!

రాం—ఇదుగో! (అని తీస్తుంది.)

కు—(చూస్తూ తనలో) హారి, నేరాసిందే! ఆ దాసీ ఉళక్కిడే ఈ ద్రోహం!

రాం—చూడు బాబూ చూడు, నీకే దస్తూరు పోలిక తెలుస్తుందేమో! (అని, యిస్తుంది.)

కు—(ఉత్తరం పుచ్చుగుని కళ్ళు మిటకరిస్తూ) అవునండోయ్, ఈ దస్తూరీ నేను చూసినట్లేఉంది, ఎక్కడో! అబ్బే, సందేహమేమిటి, నిశ్చయంగా చూసుంటాను, అసలు వాడిలాంటివాడుగాని ఇలాంటిది రాయడు!

రాం—సరేసరే, నీకడుపు చల్లగా! మరి చదువు, సేనానీ, చదువ్, నీకే తెలుస్తుంది.

కు—(చూసి చదవడం నటించి) "నా ఆత్మేశ్వరీ! నే నారాధించే కల్పకమా!"—అబ్బా, చాలా లలితంగా ఉందండీ!

రాం—లలితమా? సరె! చాలా అపవిత్రంగా కూడా ఉంది, నన్నడిగితే.

కు—(చూసి చదవడం నటించి) "నీవు పంపిన వర్తమానంతో నాకు గలిగిన గాబరా చెప్పడానికి అలవికాదు. అందులోనూ, నాకు పోటీగావచ్చిన కొత్తవైరి..."

రాం—కొత్తవైరి—అంటే నువ్వేస్మీ!

కు—(చూసి చదవడం నటించి) "అన్నివిధాలా సాహిత్యం గల వ్యక్తి కావడమూ, గౌరవప్రపత్తులు గలవాడు కావడమూ, సుప్రసిద్ధమైన పేరుగలిగినవాడు కావడమూబట్టి నాకు మరీ కంగారుగాఉంది."—ఉత్తరం చాలా అందంగా ఉందండీ.

రాం—అయ్యో వెఱ్ఱిసేనానీ, ఈ ఉత్తరం రాయడంలో వాడికి చాలా దురుద్దేశం ఉందయ్యా, నీకేం తెలుసునూ ?

కు—అదోటా ! అల్లాయితే, మామ్మగారు, వాడి సంగతి నేను కనుక్కున్నానన్నమాటే.

రాం—చదవవయ్యా, తెలుస్తుంది వాడిసంగతీ!

కు—(చూసి చదవడం నటించి) "ఇక, నీకు రక్షకురాలుగా ఉంటూ పగలుచూస్తే రాత్రి కల్లోకొచ్చే ముసిలి రాకాసి అమ్మవారు"—వాడిఉద్దేశం ఇది ఎవర్నాయి ఉంటుందీ !

రాం—నన్నేనండీ, సేనానీ, నన్నే. ఆవర్ణన నన్నే ! సరా, ఇప్పుడేమంటావు వాణ్ణిగురించి ? సరేలే, ఇంకా కాస్త చదువ్.

కు—అల్లాన్నండీ ! వాడు పచ్చిరకం లుచ్ఛాలా ఉన్నాడే ఎక్కడోగానీ ! (చూసి చదవడం నటించి) "ఈ వ్యవహారం చాలా కఠినం. కాని, ఆరాకాసి ఎన్నికళ్ళెట్టుగుని చూస్తూన్నాసరే, ఆ కళ్ళన్నింటిలోనూ నేను మెంతిచల్లగలను. మరోసంగతివిన్నాను. ఆవిడికి హాస్యాస్పదమైన అహంకారం జాస్తీగాఉందిట. దాని ధర్మమాఅని, ఆవిడ తన కురూపలక్షణాల్ని వేషాడంబరంలో దాచేస్తుందిట. మరిన్నీ, తనకి ఎంతమాత్రమూ తెలియని కఠినపదాల్తో తన సోదివాగుణ్ణి అలంకరిస్తుందిట."

రాం—అదుగో అదుగో, చూశావా, నాభాషమీద పెద్ద దండోరాయాత్ర !, ఇప్పుడేమైంది నీఅభిప్రాయం ? నా

భాషాభోగప్రయోగాన్ని అన్యోపదేశంగా తిడతాడావీడూ! ఇల్లాంటి పశువు మరి ఉంటాడా! ప్రమాణికంగా చెబుతాను. నా కీ ప్రపంచంలో బాగా అవగ్రాహం అయింది ఏదేనా ఉందీఅంటే, అది నా మాత్రభాషావిరూపమే, అక్షర లక్షల సలక్షణ వైకృతత్వమే!

కు—ఔర! వాణ్ణాండీ, ఇల్లా చీరి, ఎండేసి, ఉరిదీసె య్యాలండి. ఉండండి. (చూసి చదవడం నటించి) "ఇంకా ఏమిటంటే, పైన చెప్పిన హాస్యాస్పదాహంకారంమూలంగా, ఆముసిల్ది, కల్లపొగడ్తలకీ టక్కరి మెప్పులకీ కేవలం మూర్ఖంగా లొంగిపోయే అవకాశాలు ఉండవచ్చునుట."— ఆఁ ఆఁ ఆరి పొగరుమోతుశుంఠా!—"అది ఆధారం చేసుగుని త్వరలోనే నేను నిన్ను కలుస్తాను. చమత్కారంచేసి ఆ ముసిలి శవాకారంచేతకుడా ఒప్పిస్తాను. వీలునుబట్టి ఆ అమ్మవార్నే మధ్యవర్తినిగా చేసి, నీ సందర్శనం పొందుతాను."—అరె అరె, ఇంత ఘంటాపథంగా వరుడు ప్రియురాలికి ధైర్యంచెప్పడం ఎక్కడేనా ఉంటుందండీ?

రాం—అసలు, ఇల్లాంటిది నువ్వెక్కడేనా విన్నావా, అని! చూడు వీడూ! నా కాపుదల తప్పించుగు తిరుగుతాట్ట! చూద్దాం చూద్దాం! (అని వెకిలిగా నవ్వుతూ) అహ్హాహ్హా, మరే మరే! వాణ్ణి ఈ గుమ్మంలో అడు గెట్టనిస్తూ, తెలుస్తుందీ! ఎవరిది పైయెత్తో రుచి చూడనిస్తూ బోధపడుతుందీ!

కు—అల్లానే, మామ్మగారు, అల్లానే! (నవ్వుతూ) హారి, గర్విష్టి జాగిలాయి! నువ్వోవడవురా!—కాని, రాం

భాణమ్మగారూ, ఓపనిచేస్తే! ఈ అమ్మాయి, వాడంటే పడి తెగ యిదైపోతోందిగనక, మీరు కొంతకాలం వాళ్ళ అన్యోన్య ప్రేమలేఖల సంగతి ఎరగనట్టు నటిస్తే! వాడితో ఈ అమ్మాయి లేచిపోడానికి పన్నాగం వేసుగోనిస్తే! అదీ కాదు. లేచిపోతూంటేకుడా ఏమీ ఎరగనట్టు కళ్ళప్పగించి చూస్తూ ఊరుకుంటే! బలేగా ఉంటుందేమో! నేనూ అర్థ వాళ్ళు లేచిపోతూండే ముహూర్తానికి వెళ్ళి వాణ్ణి నడుం విరగదన్ని ఈ అమ్మాయిని చిటికెలమీద నేనే లేవదీసుకు చక్కాపోతే, తీరిపోతుందేమో!

రాం—(నవ్వుతూ దవడలు నొక్కుగుని) అయ్యో అయ్యో! నాతండీ నాతండీ, నా చిట్టిసేనానీ! నీ పన్నాగం నాకు ఎంత సంతోషంగా ఉంది, ఎంత సంతోషంగా ఉంది! ఇంతవర కెవ్వడూ ఇంతకంటె మంచిపన్నాగం లగాయించ లేదు.

కు—అది సరండి. పోనీ, ఈ అమ్మాయిని ఒఖసారి, నేను చూడవచ్చా, పోనీ ధోరణి ఎల్లాఉందో కాస్తంత గమనిస్తాను?

రాం—ఏమో! తెలియదు. అటువంటి సుదర్శనం గురించి ఈపిల్ల ఆశించడం లేదని నా సందేహం. ఇల్లాంటి వ్యాపారాల్లో అంతా ఉందిగా మరీ, తంతూ!

కు—అయ్యో దైవమా! అదికాదండీ. నన్ను ఈ అమ్మాయి గణించకపోతే, పోనీ దళవాయి వసంతం......

రాం—ఏమిటీ?

కు—(తనలో) వెయ్యాలిప్పుడు రస్నా!

రాం—నువ్వు దళవాయి వసంతం అన్నావేమిటి?

కు—అదా, మరేంలేదండీ, ఇప్పుడు చూడడానికి వచ్చినవారు, దళవాయి వసంతమే అని మీరు ఈ అమ్మాయితో చెబితే—తమాషాకోసం—తక్షణం తనిక్కడికి ఒక్క పరుగున వచ్చిపడుతుందికదా, అని...(అని, నవ్వుతాడు).

రాం—(నవ్వుతూ) అవు నవును. అదా! వసంతమే వచ్చాడనమంటావు. అంతేనా! నీ యిల్లు బంగారంగానూ! మాబాగా అన్నావు. దీన్ని అల్లా దగాచెయ్యవలిసిందే! ఇది అల్లా దగాపడడానికి అర్హురాలే. పైగా వాడుచూడు! దీన్ని చూడ్డానికి నా అనుమతి తీసుగుంటా నంటాడు. (ఈసడిస్తూ) 'చూస్తా, ఎల్లా తీసుకోగలడో, చూస్తా! (R B కి తిరిగి) కల్పకం, కల్పకం! ఇల్లారా! (వెకిలిగా నవ్వుతూ) తమ సమావేశానికి నన్ను మధ్యవర్తిగా చేస్తాట్ట! రా, కల్పకం, రమ్మంటున్నాను. (కుమారసేనాన్ని చూస్తూ) నీకూ నవ్వొస్తూన్నట్టుంది సేనానీ! (అని నవ్వుతూ) వాడిపొగరు తీరావచ్చి ఎంత రహాస్యాస్పదం అయిపోయిందో, పాపం!

కు—(నవ్వుతూ) మరేనండి. సంగతి యావత్తూ, దైవసాక్షిగా చెబుతాను, భ్రాత్రిగా హాస్యాస్పదంగా తయారైంది.

రాం—(R B కి మళ్ళీచూసి, కోపంగా) ఈ రాలు గాయి నామాట వినిపించుగోదే! సరేసరే, నేవెళ్ళి వెంటనే

చెప్పేస్తాను ఎవరొచ్చారో! తమాషా లేదు ఏమీ లేదు, చూడవచ్చిన వ్యక్తి కుమార సేనుడే అని చెప్పేస్తాను. కన్నె పిల్లకి ఉండవలిసిన గౌరవప్రవర్తన కనపరచకపోతే, వేస్తాను చెంపమీద.

కు—మీచిత్తం, మామ్మగారు!

రాం—నా చిత్తం కాదు, సేనాని! ప్రస్తుతం అంతా నీ చిత్తమే. నీకు నవ్వు ఇంకా ఆగటంలేదు. నేను ఎన్ని కళ్ళతో కాచినా అన్నింటిలోనూ మొంతి చల్లుతావ్! అవు నవును, చూద్దాం చూద్దాం (అంటూ హేళనగా నవ్వుతూ గర్వంగా R B కి నడిచిపోతుంది.)

కు—(నవ్వాపుకుని) ఇప్పుడు పోనీ చెప్పేస్తే, కోరిన ఫలం చేజిక్కుతుంది. కాని, కొత్తగా ఎవడో వస్తాడను కుంటూంటే పాతవాడే మళ్ళీసిద్ధం అయ్యాడని కల్పకానికి ఆశాభంగం కలిగి, నన్ను కల్పకం విడనాడచ్చు. నన్ను పోలుస్తుందో లేదో చూస్తాను.

(అని, కొంచెం ముసుగు వేసుకుని, L M నించి L B కేసీ R B కేసీ చూపులు చూస్తూ, ఏదో చూసి ఆలోచించు కుంటూన్నట్టు ఉంటాడు.)

కల్ప—(R F నించి వస్తూ) ఔర! ఇప్పుడు ఎటు వంటిగండం గడవాలో కదా! హృదయానికి పరాయి వాడైన ఘటం ప్రారంభించే నీచప్రేమోపన్యాసాలు విన వలిసిన అగత్యం పట్టడంకంటె పాతకం మరిఉండదు. ఒక్కొక్కపిల్లకి. ఇల్లాంటిఒరకం రావడమూ, అప్పట్లో ఆ

పిల్ల తన పాతయిష్టుడి తరఫున వాదించి, ఔదార్యంవహించి తప్పుగోవలిసిందని క్రొత్తకాముకుణ్ణి వేసుకోడమూ జరుగు తోంచ్చేసంగతి వింటూంటాం. నేనూ అంతే చేస్తాను. అడుగో ఆ కొత్తదిక్కుమాలి విగ్రహం. పైగా సేనానిట, నా వసం తానికీ వీడికీ పోలికేమిటీ? వీడు తనసోది ప్రారంభించడేమో ఇంకా! చాలా నిర్లక్ష్యకాముకుడులా ఊరుకున్నాడు— ఎక్కడా చీమకుట్టినట్టేనా లేదు. పోనీ, నేనే ప్రారంభిస్తాను. ఏమండీ?

కు—ఏమండీ! (అని సభ కేసి తిరుగుతాడు.)

క—ఓయి దేవుడా, వసంతమే?

కు—నిమ్మళం, నిమ్మళం, పీకలమీాదికొస్తుంది. ష్, ఆశ్చర్యం తగ్గించుగో.

క—తగ్గించుగోనా? నాకు పరమాశ్చర్యం వేస్తోంది, పరమభయం పుడుతోంది, పరమానందం కలుగుతోంది. దైవకృపవల్ల మీారిక్కడికి ఏరీతిగా రాగలిగారూ?

కు—సూక్ష్మంగా చెప్పాలంటే, మీా అత్తని మోసపుచ్చేశాను. ఈ సాయంత్రం నాకు పోటీదారుడొకడు నిన్ను చూడవస్తాడని తెలుసుగుని, వాడు రావడం ఆలస్యం అయ్యే ఏర్పాట్లు చెయించేసి, నేనే కుమారసేనాన్ని అని చెప్పేసి వచ్చేశాను.

క—బలే వసంతం, బలే. మీారు కుమారసేనమే అని ఈవిడ నమ్ముతోందన్నమాట.

కు—ఈవిడకి గాఢమైన నమ్మకం జనించింది.

క—(నవ్వుతూ) అబ్బ అబ్బ! ఆవిడకంటె మీరు మరోఆకు ఎక్కువ చదివిన వారవడంవల్ల నాకు నవ్వు ఆగటం లేదు.

కు—సరి సరి. ఇవి అమూల్యక్షణాలు. వీటిని తేలికగా చూడకూడదు. ఇటువంటి తరుణం మరి రాకపోవచ్చును. అందుకని, దయతో నా సన్నిధికి అవతరించిన దేవదూతని మొక్కేది ఏమనంటే! తగని ఈ చెరలోంచి నిన్ను విడుదల చెయ్యడానికిన్నీ, ఆప్యాయనంగా విన్నవించుగుని నా హక్కు ప్రకారం నా బహుమానం నేను కోరుకోడానికిన్నీ ఒకసుముహూర్తం నువ్వు నిర్ణయించాలని.

క—అయితే, నాకు రానున్న ఐశ్వర్యం మనం వదులుకుని వెళ్ళిపోడం మీ కిష్టమే ?

కు—ఇష్టమే కల్పకం! నువ్వుచాలు, వచ్చేయ్. నీ సౌందర్యం నాకు ఐశ్వర్యం, నీ ప్రేమ నాకు కట్నం. నీ ప్రేమ ఉదారం అని నాకు తెలుసు. దీనుడైన ఈ వసంతం తీర్చుకోగలిగింది ప్రేమఋణం మాత్రమే.

క—(తనలో) ఎంత నచ్చుతున్నాయో ఈమాటలు! ఎంత రమణీయమో ఇతడితో దారిద్ర్యం !

కు—ఓ, ఏమిచెప్పను, అప్పటి మన జీవితం! ప్రేమనే మనం మొక్కుతాం, ప్రేమే మనకి ప్రాపవుతుంది. తాపసులలాగ మనం నిష్ఠతో ప్రేమారాధన చేస్తాం. అల్పవ్యవహార విసర్జన చేసి త్రికరణశుద్ధితో ప్రేమనే దీక్షగా

కొలుస్తాం. కష్టాల్ని సగర్వంగా భరిస్తూ, ధనాభావంలో కూడా ఆనందంగానే ఉంటాం. మనల్ని ఆవరింపగల కష్టాంధకారంలో మన పవిత్ర ప్రేమజ్యోతియొక్క శోభ రెట్టింపవుతుంది. అదృష్టవశంచేత నాకు రాగల సర్వాన్నీ విరజిమ్మి పారెయ్యడానికి నే నప్పుడు జంకను—(అని కల్పకం చెయ్యి పట్టుగుని) ఇట్లా, నా కల్పకం నా చేతికి చిక్కినప్పుడు!

క—(తల వంచుగుని, తనలో) నా బాధలకి అంతం అంటూ ఉండలిగాని, ఇతడితో నేను ఎక్కడికైనా వెళ్ళిపోగలనుగదా!

[R F నించి రాకుండా, రాంభాణమ్మ, తలమాత్రం ఇవతలకి పెట్టి (సభ కేసి) వాళ్ళసంభాషణ ఆలకిస్తుంది.]

రాం—(తనలో) మా కుర్రపిల్ల ఏమాత్రం మర్యాదగా ఇదవుతోందో చూడాలని నాకు మహా తొందరగా ఉంది.

కు—అంత దీర్ఘాలోచ నేమిటి, కల్పకం! నీ ఉద్రేకం తగ్గిపోయిందే!

రాం—(తనలో) ఉద్రేకమా? ఈపిల్ల మంచి కోపంలో పడింది గావును!

క—తగ్గిపోదు. నాకంఠంలో ఊపిరి ఉండగా నా ఉద్రేకం తగ్గిపోదు.

రాం—(తనలో) ఆఁ, ఆసి పింజారీ! దీని మొహం ఈడ్చా! దీనికి జీవితం జీవితం ఉంటుంది గావును తీవ్రకోపం!

క—నా అభ్యాంత్రా మేనత్తగారి అర్థంలేని బెదిరిం పులు నేను గణిస్తాననుకోకండి, మీారు.

రాం—(తనలో) చాల్చాలు! ఏడిసినట్టేఉంది పెద్దల మీాది భక్తి!

క—ఆవిడ తనకి కావలిస్తే కుమారసేనాన్ని వరిం చుకోసింది, నా వరుడు వసంతమే.

రాం—(తనలో) కుమారసేనాన్ని నేను వరించు కోనా? ఓసి నీ మొహం ఇద్దైరిగదే! ఎంత తెగసి చెప్పే స్తోందో, పాపం ఈ అబ్బాయి మొహంఎదట, మొహం మీాద! హవ్వ!

కు—నా దరఖాస్తు గమనించాలి. (అని, మోక రించి, చాచిన చేతులతో ప్రార్థిస్తాడు)

రాం—(తనలో) అయ్యో, చిట్టిసేనానీ! వెర్రివాడా! మోకరించి అర్థిస్తున్నావుటోయ్, పిచ్చితండ్రీ!—మరి నేను ఉండలేను. (అని, పైకివచ్చి) ఓసీ గుంటనక్కా! నీ మాట లన్నీ పక్కనించి విన్నాన్లే!

క—(తనలో) అమ్మ, ముసిలిపీనుగు కాపుదలా!

రాం—కుమారసేనానీ! ఒళ్ళు గరిపొడిచేటటు వంటి దీని మొరటుతనం గురించి నిన్ను ఎల్లా క్షమాపణ వేడుకుంటే సరిపోతుందో నాకు తెలియకుండా ఉంది.

కు—(తనలో) ఒస్, ఇంతేనా, అయితే భయం లేదు. (పైకి) మామ్మగారూ, ఏమీా ఫరవాలేదు, నాకు

ఆశ పూర్తిగా ఉంది. కాలక్రమాన్ని మీ కల్పక దేవి తన అభిప్రాయం మార్చుగోవచ్చు.

రాం—దీనిమీద ఆశపెట్టుగుంటే రవంత లాభమూ ఉండబోదు, నాయనా! ఇది ఎంత వణపెంకిదనుకున్నా వేమిటీ, పట్టిందంటేపట్టు కేవలం ఉల్లాకపట్టు!

క—సరేగాని అత్తయ్యా, నువ్విప్పుడ నేమాటేమిటీ?

రాం—ఓసి సిగ్గుమాలిన కయ్యాలగొట్టీ! ఆ అబ్బాయి మొహంమీద చచ్చు తెగ్గొట్టి నీప్రేమ మరోడిమీద ఉంది-అనలేట్టే? ఇతని దానవుకావడానికి నీకు ఇష్టంలేదని నువ్వు అనలేట్టే?

క—అనలేదు, అత్తా, అనలేదు.

రాం—అయ్యో అయ్యో! అయ్యో దేవుడా! అల్లా ఎంత ఊతంగా బుకాయిస్తోందో! కల్పకం కల్పకం! కన్నె పడుచు శుద్ధాబద్ధాలు ఆడకూడదని నీకు ఈపాటి తెలిసి ఉండాలిస్మీ ఏమనుకున్నావోగాని! ఇప్పుడిప్పుడు నువ్వు డాబులు కొట్టలేదూ—నీ వసంతం, దిప్పకాయి రాలుగాయి వసంతం, నీ మనస్సు ఏలుతున్నాడనీ? చెప్పూ. ఆసంగతి మొదట చెప్పూ.

క—ఆమాట నిజమే, అత్తా! వసంతాన్నితప్ప ఇతరుణ్ణి.....

రాం—ఆగాగు, ఉండు, మహా నొక్కి చెప్పేదానివి బయల్దేరావుగాని, అంత మొహంమీదేమాట అనేసే మొహమాటంతనం కూడదు.

క—రాంభాణమ్మగారూ! మిమ్మల్ని ప్రార్థిస్తు న్నాను. ఈ అమ్మాయి వాగ్ధోరణి అడ్డకండి. ఈవిణ్ణి ఇల్లాగే మాట్లాడనియ్యండి, నాకు మరీసంతోషం. నాకు కోపం లేదు గీపం లేదు సరికదా, ఈవిడ ఈ రీతిగానే ఉపన్యసించాలని నేను కోరుకుంటున్నాను, నమ్మండి.

రాం—సేనానీ! నీమంచి అతిమంచి, నీ ఓర్పు అతి సరసమైన ఓర్పు! ఓ పిల్లా, రా, నాతో!—సేనానీ! మనం మళ్ళీ కలుస్తాం. మనం నిర్ణయించుగున్నది, జ్ఞాపకం పెట్టుగో!

కు—అల్లానే, మామ్మగారు!

రాం—పిల్లా, రా. మాంచి లలితంగా వారిసెలవు పుచ్చుకో.

క—దీవెనలు కురియాలి వసంతంమీద, నా ప్రియ వసంతం, నా ప్రియుడైన వసంతం...

రాం—ఓ సేవ్, నువ్వుమరి నోరుమూస్తావా ముయ్యవా? (అని, కల్పకం నోరు కుడిచేత్తోమూసి, ఎడంచేత్తో ముందుకి తోసి, R F కి నడిపించుగుని నిష్క్రమిస్తూంటే, కల్పకం వెనక్కి తిరగడానికి యత్నించి కుమారసేనాన్ని చూస్తుంది.)

కు—(కల్పకాన్ని చూస్తూ తన చెయ్యి తను ముద్దెట్టుగుని L F కి వెళ్ళిపోతాడు.) (తెర)



## రంగం-4

[దేవయ్యబస. దేవయ్య వేషం వేసుగుంటూ, అద్దంలో చూసి దిద్దుకుంటూ, ఉంటాడు]

దే—(అద్దంలో చూసుగుని, నవ్వుకుంటూ, ఏదో కనిపెట్టినట్టు, అథాత్తుగా L F కి చూసి) ఒరేయ్ ఒరేయ్, తలుపులూ !

త—(L F నించి వస్తూ) అయ్యఅయ్య !

దే—ఈ వేషానికి నేను మూడుమూర్తులా సరిపోతా నని అనుకుంటావా ?

త—ఊరికే సరిపోడం కాదండి, అయ్యగారు, మీరు ఈ వేషంలో పురో స్వరూపం అయిపోయారు! సామి కృప వల్ల మన అదృష్టం తిన్నగా ఉండాలిగాని, ఈవేషంలో మీబొమ్మ అచ్చుకొట్టి విలాసపురంలో అమ్మి లాభాలుతీసి అశేషజనమూ ఆ నర్తకంలో పడిపోతారు.

దే—అల్లాయితే, తలుపులూ, వేషం వెయ్యడంవల్ల ఉందంటావు, తేడా? సరేసరే. కాని, నువ్వెళ్ళి, ఆ నాట్యం నేర్పే లాలయ్యని తీసుకురా.

త—(దణ్ణంపెట్టి, R F కి వెళ్ళి, అప్పుడే మళ్ళీవచ్చి) జ్వాలారంగం గారు మిమ్మల్ని చూడొచ్చారు.

దే—రమ్మను రమ్మను.

త—(R F కి నడిచి) అయ్యా, రండి. (అని కుర్చీ చూపించి, R F కి నిష్క్రమిస్తాడు.)

జ్వా—దేవయ్య గారూ! మీ ఆలింగనం నాకు ఆహ్లాదకరం.

దే—ప్రియ జ్వాలారంగంగారూ! మీ పాణిపద్మాలు చుంబిస్తున్నాను.

జ్వా—ప్రియమిత్రమా, దయచేసి చెప్పండి. ఇంత అకస్మాత్తుగా, ఈ విలాసపురం మీరు రావడానికి కారణ మేమిటీ?

దే—ఏమడుగుతావు, సోదరా! మన్మథుణ్ణి వెంటా డించాను, కొరివిదెయ్యం వెనకాలే వెళ్ళినట్టు. చిట్టచివరకి జవ్వకు నేలలో దిగబడ్డాను. ఇంతెందుకూ, జ్వాలారంగం గారూ, నాయెడల మహాగొప్ప అపచారం జరిగిపోయింది. ఫలానా అని పేర్లు చెబుతూంటడం నాకు ఇష్టంఉండదూ, గొప్ప అపచారం పొందిన ఒక గొప్పవాణ్ణిగా నన్ను గణిం చండి.

జ్వా—దయచేసి సంగతి చెప్పండి, పోనీ, పేర్లు నే నడగను.

దే—అయితే గమనించండి, జ్వాలారంగం! నేను అవసరమైనంత ఘాటుగా ఒకానొక యువతిని ప్రేమించాను. ఆమె మిత్రులు నాపక్షం నిల్చారు. ఆవిణ్ణి వెతుక్కుంటూ ఈ విలాసపురం వచ్చిపడ్డాను. వచ్చినట్టు కబురుచేశాను. ఇంతా చెయ్యగా, నాకు తకీమని సమాధానం—ఏమనీ? పిల్లని మరొకరికి దఖలుపరిచేస్తున్నారనీ! ఇదండి, జ్వాలారంగం గారు, నాయెడల జరిగిన అపచారం.

జ్యా—మనస్ఫూర్తిగా చెబుతాను, చాలా అపచార మండి. సమాధానం అల్లా ఎందుకువచ్చిందో మీ రేమన్నా పోల్చగలిగారా ?

దే—ఎంత సేపూ. నిమిషంలో. ఆ యువతి ఎవడో వసంతాన్ని ప్రేమిస్తోందిట, వాడిప్పుడు ఈ విలాసపురంలోనే ఉన్నాట్ట. వెధవప్రపంచంకదండీ, ఆ చచ్చినాడిమూలాన్నే అల్లాంటి సమాధానం వచ్చిఉంటుంది.

జ్యా—అయితే నీ ప్రేమవిషయంలో పోటీదారు ఉన్నాడన్న మాట. వాడు శుద్ధ అన్యాయంగా నీపదవి ఆక్రమిస్తున్నాడన్న మాట.

దే—అన్యాయంగానే, ఆ, శుద్ధ అన్యాయంగానే. లేకపోతే న్యాయంగా కుడా ఆక్రమించగలడూ వాడి బతుక్కి !

జ్యా—మరి కర్తవ్యం నువ్వెరుగుదువని నా నమ్మకం.

దే—నేను ప్రమాణపూర్తిగా ఎరగను.

జ్యా—అయ్యో, ఎరగవూ ? ఆయుధాలు అస్త్ర మానమూ చేతులోనేగా ఉండడం మనకి ! ఇప్పుడు నీకు బోధపడిందా ?

దే—కొంపతవ్వి వాడితో పోట్లాడమంటావా ?

జ్యా—ముమ్మాటికీ అంటాను. లేకపోతే మరేం ఉంటుంది నా అభిప్రాయం ?

దే—ఎల్లామరీ ? వాడు నన్ను ఏమీ రెచ్చకొట్ట లేదే !

జ్వా—ఓయి వెఱ్ఱివాజా! నిన్ను వాడు ఎంత రెచ్చ గొట్టాలో అంతా రెచ్చగొట్టేస్తేనే! ఏ యువతిని మరోడు ప్రేమిస్తున్నాడో ఆ యువతినే తనూ ప్రేమించడం అనే నేరంకంటె ఘోరం ఎవడేనా ఎల్లా చెయ్యగలడూ? నా అంత స్సాక్షిగా చెబుతాను, అది ఎంతమాత్రమూ క్షమింప రాని స్నేహవిచ్ఛేదకారణం.

దే—అల్లా మాట్లాడతారేం? స్నేహ విచ్ఛేదమా? సరి సరి. నాకు ఆమనిషితో పరిచయమే లేదు. నేను పుట్టిం తరవాత వాణ్ణి చూణ్ణేలేదు. స్నేహమే లేనప్పుడు విచ్ఛేదం ఎట్లా?

జ్వా—అదేంవాదనా, అడ్డదిడ్డంవాదనా! ఆమాట కొస్తే, వాడు నీసొత్తుతో ఇంత చనువుగా వ్యవహరించ డానికి వాడికి హక్కే లేదు.

దే—నిజమే నండోయ్, నిజమే. జ్వాలారంగం గారూ, మరి వీల్లేదు, నేను యమకోపంలో పడాలి, పడు తున్నాను. తప్పదు. తత్క్షణం అగ్నిహోత్రం పుంత అయి పోతున్నాను. కత్తులు కటార్లు! ఇల్లానే, ఒక్కొక్కడికి బోలెడేసి శౌర్యం కడుపులో ఉండిపోతుంది గావును, వాడికే తెలియకుండా! ఔర! పోనీ, వాడికిమల్లే నేనుకూడా కొంచెం హక్కు సంపాదించెయ్య డానికి పన్నాగం వేస్తేం?

జ్వా—ఓయి నీహక్కు నాశనంగానూ, హక్కెవడికి కావాలయ్యా, నీ గౌరవానికి చిక్కొచ్చి నప్పుడూ! ఆ అర్జునుడూ ఆ అలెగ్జాండరూ ఆ ఔరంగజేబూ వాళ్ళంతా

ఏపత్యాన్ని హక్కు ఉన్నదీ అంటూ గుణకారాలు చేస్తూ కూచున్నారంటావా ఏమిటి! తీశారు ఆయుధాలు, వేశారు దిమ్మతిరిగేటట్టు! ఇక, న్యాయం అనేది ఎక్కడుందో వెత కండర్రా, యుద్ధం వద్దనే మందకొడిపీనుగుల్లారా—అన్నారు, తీరిపోయింది.

దే—ఓహో! ఏమి మీ వాక్కూ, ఏమి మీ మాటలూ! అని నా హృదయంలో నేరుగా ప్రవేశించాయి గదా! ధైర్యం అనేది అంటువ్యాధి అని నా నమ్మకం. నా అంతర్యంలో ఏదో శౌర్యం, అనగా మాటలకి లొంగని ఒకానొక ధైర్యం, ఆవిర్భవిస్తోందని నాకు అనిపిస్తోంది. తీ, పైకి తీ, తుపాకీ, పేల్చెయ్—అన్నాడు. ఈ తక్షణం వాణ్ణి సవాల్ చేసేస్తాను.

జ్వా—అయ్యో, మిత్రమా! మ్యూజియంహాలు దూరం అయిపోయిందిగాని, లేకపోతే నా వంశంలో పూర్వీ కుల శౌర్యచిహ్నాలన్నీ వరసాగ్గా నీకు చూపించి ఉండేవాణ్ణి. అవి ఈ గది గదంతా నిండిపోతాయి. మా వంశంవాళ్ళల్లో ఎవడేనా యుద్ధం చెయ్యవలిసివచ్చిందంటే, అవతలవాణ్ణి ముక్కలకింద నరికేశాడన్నమాటే. మా పూర్వ శౌర్యానికి మెచ్చి ప్రభుత్వంవాళ్ళు మా కిచ్చిన ఇల్లూ పొలమూ నాచేతులోంచి జారిపోతేమాత్రం లెక్షేమిటంటాను, దైవ కృపవల్ల, మా గౌరవమూ మా పూర్వీకుల ఛాయాపటాలూ కాస్తేనా మాసిపోకుండా సుబ్బరంగా ఉన్నాయి.

దే—అబ్బా! కాని, మీ రెరగరు గావును జ్వాలా రంగంగారు! మా వంశంలోనూ ఉండేవారంటోవు యోధాన

యోధులు! ఆ ఉండడమేనా సామాన్యమా? ప్రతీవాడూ తలో సేనానీ, తలో దళవాయీ, తలో ఫౌజుదారూ—యథా శక్తి. ఓ, ఏమి పార్టీలు ఏమి పీపాలు! మీరిక మాట్లాడకండి. నా సంకల్పం అయిపోయింది. మీ ఉరుముతో నా గుండెల్లోని దయాదాక్షిణ్యాలు ఇగిరిపోయాయి. ఓ, నాసామీ, ఆ నాటకంలో వాడన్నట్టు, "అట్టి సాహస కృత్యాలు నేను చెయ్యగలిగే ఉన్నాను."

జ్వా—సరి సరి. ఇటువంటి విషయాల్లో ఉద్రేకం ఉండకూడదు. ఇవన్నీ సంఘమర్యాదలకి అనుగుణంగా ఉండాలి.

దే—మర్యాద ఏమిటండీ, జ్వాలారంగం! నేను గొప్ప ఉద్రేకంలో పడాలి, కాదు, మాంచి రౌద్రంలో ఉరకాలి. ప్రియమిత్రమా! నన్ను నీవాణ్ణిగా కట్టి, రౌద్రం పూననియ్యి! తీ, కాగితం. ఇదుగో కలం—రానీ, రచన, రానీ! ఎల్లా ప్రారంభింతాం? ఎగిరిపోవాలి తుపాకులూ గుళ్ళూనూ! అయినాసరే, ఖో తేపోయింది, నేను స్ఫుటంగా గమ్యంగా రాసేస్తాను.

జ్వా—నువ్వే నిదానించి రచించు.

దే—అబ్బ, చెప్పవయ్యా! ఒట్టుతో మొదలెట్టనా, తిట్టుతోనా?

జ్వా—ఛీఛీ. ఆరిందాగా మొదలెట్టవయ్యా. సాత్త్వికంగా ఉండాలి. ఆరంభించు, "ఆర్యా"......

దే—అది మరీ మర్యాదన్నరగా ఉంటుందేమో!

జ్వా—రాయి. "మని మీద్దరమున్నా ఒకే యువతిని"...

దే—మరేమరే. అదే వచ్చినచిక్కు. మరే, "యువతిని"—

జ్వా—"వరించడంవల్ల"

దే—ఊఁ

జ్వా—"బయలుదేరగల గలిభీయావత్తూ వారించడానికి"

దే—ఊఁ—'వారించడానికి'

జ్వా—"మీ సమావేశభాగ్యం నాకు లభిస్తుందని ఆశిస్తున్నాను."

దే—ఛష్. వాణ్ణి భోజనానికి రమ్మంటున్నానా ఏమన్నానా?

జ్వా—అబ్బ, బాధపడకయ్యా.

దే—సరే. రాశాను. 'ఆశిస్తున్నాను.'

జ్వా—"దాన్తో ఎవరిహక్కు గొప్పదో తేల్తుంది. స్థలం—రాజమైదానం. సమయం—సాయంకాలం"

దే—ఓ. బలేగావుంది. తక్షణం మడిచి పంపించేస్తాను. చేతులో కత్తిగల నాముద్ర వేస్తేస్తాను.

జ్వా—ఈ కాస్త వివరణతోటే మీ యిద్దరిమధ్యా చికాకుగాని అపోహగాని మరిఉండదు.

దే—నిశ్చయంగా. తరవాత తరవాత చికాకూ అపోహ కలక్కుండా ఉండడంనిమిత్తమే ముందుగానే పోట్లాడేసుకోడం,

జ్యా—ఈ కాగితం తక్షణం నేనే తీసిగెడతాను. నీకు మరు పెక్కున.

దే—మరే దిక్కుమాలి మరుపు. అయినా, నేనే ఇస్తా.

జ్యా—ఇప్పుడే వస్తాను.

దే—అర్జెంటుపనుందా ?

జ్యా—కొంచెం. ఇక దాచడం ఎందుకూ ? నాకూ ఇల్లాంటిదే ఒక వ్యాపారం ఉంది. ఇక్కడ ఒక పైలా పచ్చీస్ సేనాని ఉన్నాడు. వాడు నిన్న నన్ను హేళన చేశాడు. వాడితో ఎల్లానేనా జట్టీపెట్టుగుని వాడిగ్రంథం కనుక్కుంటాను.

దే—అప్పయ్యో ! ముందు నువ్వూ వాడూ కొట్టు గుందురుగాని. వాణ్ణి ఒక్ఖరవ్వ చంపిపారేద్దూ బాబూ ! నాకు శాస్త్ర నీతి నేర్పినవాడవవుతావు !

జ్యా—అబ్బో ! నీకు వీలునుబట్టి నీతి నేర్పాలని నాకు లోపల మహాఉంది. సరేగాని, ప్రస్తుతం ఇది జ్ఞాపకం ఉంచుగో. శత్రువుని కలియగానే, నువ్వు మార్దవంగానూ సుముఖంగానూ ఉండాలి. నీ ధైర్యంకుడా నీఖడ్గం లాగే వాడిగానూ నునుపుగానూ ఉండాలి. (అని R F కి కోపంగా వెళ్ళిపోతాడు.)

దే—(ఖడ్గంతీసి) నా ధైర్యంకుడా నాఖడ్గంలాగే వాడిగానూ (అని అంచు ముట్టుగుని) నునుపుగానూ (అని పక్కరాసి) ఉండాలి,

త—(R F నించి ప్రవేశించబోయి, వెనక్కి వెడతాడు.)

దే—(కత్తితో వెయ్యడం అభినయిస్తూ) ఇల్లా వేసేస్తే! ఒకటే దెబ్బ, రెండే తునకలు!

త—(వచ్చి) స్వామీ, ఎవర్ని?

దే—వసంతాన్ని.

త—ఈ జ్వాలారంగమేనాండి, మిమ్మల్ని ఈ అవస్థకి తెచ్చినవాడు!

దే—అవస్థేమిట్రా? అతడు నాకత్తిలో జీవం పోశాడు.

త—బాగా ఏడిశాడు లెండి నన్నడిగితే.

దే—ఆఁ ఆఁ. అల్లా అంటావేమిరా?

త—నిజమేనండి. జ్వాలారంగం కాదు ఈ ప్రపంచంలో వాడి బాబురంగం ఎవడొచ్చినా సరే, నాకు తోచకపోతే, నేను కాస్తేనా పోట్లాడను. ముసిలిదానికి తెలిస్తే, బతకనిస్తుందా?

దే—హోరి, వెర్రితలుపులూ! నువ్వు ఆ జ్వాలారంగు ఉపన్యాసం వినుంటే ఎంత బాగుండిపోను! అగ్గిభరాటా! అతడు నీకు శౌర్యం రేకెత్తించి ఉండేవాడు.

త—చచ్చేవాడు, పోదురూ, వాడితెరమూటా. అల్లాంటి పచ్చినెత్తురు తాగే జంతువులంటే నాకు వర్జం. చూడండి, అయ్యగారూ! ముష్టియుద్ధం అంటారా, పోనీండి, నేను వద్దనను. అంతేగాని, కత్తులూ తుపాకులూ ఏమిటండీ? వీట్లవల్ల మేలుకలగడం నే నెన్నడూ విన్లేదే!

దే—ఒరేయ్, తలుపులూ ? నువ్వొరగవ్, ఊరుకో! గౌరవంరా, నా గౌరవం ! నా గౌరవంగురించి నేను ఎంత జాగర్తైనా పణ్ణాపడాలి.

త—ఆమాట బాగానే ఉంది. గౌరవాన్నిగురించి మనిషి జాగర్తపడాలి. అల్లాంటప్పుడు మనిషినిగురించి గౌరవం అనేది జాగర్తపడాలా ?

దే—ఆ. పడాలి.

త—పడదు.

దే—నీకెల్లా తెలుసూ ?

త—గౌరవంగురించి మనిషి ఆహుతి అయినట్టే మనిషినిగురించి గౌరవంకుడా ఆహుతి కావాలంటాను. మీరెరగరండి బాబూ ! ఈ గౌరవం అనేది ఉందే, ఇది మనిషికి అతి విచిత్రమైన దొంగనేస్తం. తాను బంట్రోతంటే తనకి బంట్రోతనే బాపతు.

దే—అంతేఅంటావా ?

త—ఒట్టండీ. చచ్చినంతపనిజరిగి నెగ్గేశామా, లాభం మన గౌరవానిది. చచ్చేపోయామా, మన గౌరవం చపాయించేసి శత్రువుని చేబడుతుంది.

దే—అయ్యో వెర్రివాడా ! చచ్చింతరవాత గౌరవం మన గోరీని ఆశ్రయించి ఉండదూ ?

త—గోరీని ఆశ్రయించి ఉండే పదార్థాలు వేరండి.

దే—ఓరి నీవాదం ఇదైపోనూ ! తలుపులూ ! నువ్వు బలే పిరికివాడివిలా ఉన్నావేంరా ! ఛీ ఛీ. నాఅంత నవీన

శౌర్యవంతుడు నీఅంత పిరికిపంద మాటలు వినకూడదు. ఏమిటి నీమాటా? నా పితృదేవతల్ని అవమానపరచనా? ఆలోచించు తలుపులూ ఆలోచించు. పితృదేవతలకి అప్రతిష్ఠ తేవడం అంటే ఏమిటో ఆలోచించు.

త—మీాదయఉండబట్టి చెబుతున్నాననుకోండి. పితృదేవతలకి అవమానం జరక్కుండా ఉండే అమోఘమార్గం ఏదీఅంటే, వాళ్ళల్లో జేరకుండా ఉండడానికి ఎంతకాలం వీలుంటే అంతకాలమూ జేరకపోవడమే! పైగా, చూడండి, అయ్యగారూ! వారి దగ్గిరికి ఎంతో తొందరగా, కొంపంతా మునిగిపోయినట్లు, కపాలంలో ఒక ఔన్సుబరువు సీసపుగోలీ ధరించి, ఎగబడడంకంటె మానేసెయ్యడం మంచిదేమో! మన పితృదేవతలు మహా మంచివ్యక్తులు. కాని, దర్శన పరిచయాలు వాళ్ళతోకంటె మరెవళ్ళతో కోరుకున్నా నయమే అని నా అభిప్రాయం.

దే—కాని, తలుపులూ, ఈ పోట్లాటలో ఏదో మహా గొప్ప దారుణమైన పెద్ద ఉపద్రవపు అపాయం ఉంటుం దని అనుకుంటున్నావా ఏమిటి? జన్మాజన్మ! చాలా పోట్లాటలు ఎంతమాత్రమూ గలిభీలేకుండా గుప్‌చిప్‌గా జరిగిపోతూంటాయి.

త—అయ్యో కర్మమా! తొంభైతొమ్మిది పాళ్ళు ప్రాణంమీాదికి వచ్చేది మీాకే! అయ్యబాబో! అవతలి వాడు సింహంలాంటివాడు కావచ్చు. వాడిదగ్గిర జోడుగుళ్ళ కత్తులూ నరుక్కుపోయే తుపాకులూ ఉంటాయి, అద్భుత మైనవి. (భయపడుతూ) చచ్చాంరా దేవుడా! నాకు ఒళ్ళు

జలభరిస్తోంది. ఆ ఆయుధాలన్నింటికీ వెధవదాహం, నెత్తురు దాహం. వాటిని నేను అసలు ఒప్పుగోను. ఆమాటకొస్తే, అల్లాంటివి నేను బాల్యంనించీకుడా ఊహకుడా చెయ్యలేదు. నన్నడిగితే, బాగా మందుదట్టించిన తుపాకీఅంత నిర్దాక్షిణ్య జంతువు భూమిమీద ఎక్కడాఉండదండి.

దే—ఓరి నీ భయంకాలా! నాకు భయం ఏమిట్రా? అగ్నీ, గంధకం! నువ్వు భయపెడితే నేను భయపడతా ననుకున్నావా? ఇదుగో నా సవాల్. కుమారసేనం చేతికిచ్చి వసంతంగారికి పంపించేస్తా,

త—మహారాజులా పంపండి. కుట్రదేవతసాక్షిగా, ఆ రాయబారం అతణ్ణే జరపనీండి. మీారు ఓమంచి గుర్రాన్ని నాకు దానంచేసినాసరే, నేనల్లాంటి పాడుపని చెయ్యను. ఓరి దేవుడా! (అని, ఉత్తరంకేసి చూస్తూ) చూడండి, ఆ ఉత్త రం వాలకం. నిజంగానే. దాని మొహంమీద ఎంతకుట్రా ఎంత దుష్టత్వమూ కనిపిస్తున్నాయో అప్పుడేను! (వాసన చూడ్డం నటించి) చూశారా, చూశారా! ఆ ఉత్తరం ఎల్లా తుపాకీమందు వాసనకొడుతోందో, యుద్ధభటుడి సంచీ లాగ! అబ్బఅబ్బ! అసలు ఇల్లాంటి ఉత్తరాలు చూస్తూండ గానే ఠ పేలుమని పేల్తాయికుడానూ!

దే—ఛీ, పో, చవటా! నీకు మిడతపాటి ధైర్య మేనా లేదూ!

త—అయితే సరేనండి. నేను మరిచెప్పను. చెప్పక పోతేమాత్రం, తప్పుతుందిగనకనా! చెడువార్త ఎల్లానూ

మేం వీవాలి. అయినా నా కెందుకు? (కళ్ళు నులుముకుంటూ) ఒసీ, జానీ! నువ్వు మన యజమానికోసం ఎంత ఏడుస్తూ మొరుగుతావోకదా! వెర్రిదానివి, నోరులేని కుక్కవి, నీకెల్లా తెలుస్తుందీ ఈయన తుపాకీ సరసానికి వెళ్ళడం! స్వామీ, వినిపించుగోండీ. మన ముసిలికల్యాణి గుఱ్ఱం, మిమ్మల్ని పుట్టలనక గుట్టలనక పదేళ్ళనించి మోస్తోంది! అది జన్మ ఎందుకు ఎత్తానాఅని ఉసూరుమని పోతుంది. (అని, వసిళ్ళుతాడు.)

దే—(ఏడుపు స్వరంతో) లాభంలేదు, తలుపులూ! నేను మనస్సులో నిశ్చయం చేసేసుగున్నాను. (కళ్ళు ఒత్తుగుంటూ) వెళ్ళిపడతాగ్రా, పిరికిపందా, నాకల్లా బుద్ధి పుట్టేసిందిరా!

త—(R F కేసి చూసి, అటు వెళ్ళివచ్చి) కుమారసేనంగారు వచ్చారండి.

దే—రమ్మను రమ్మను.

త—చిత్తం చిత్తం. (వెళ్ళకుండా) దైవమా, రేపీ పాటికి మేం నాశనం కాకుండా చూసేభారం నీదీ!

దే—(కోపంగా) ఏమిట్రా అదీ! నాకు కోపం తెప్పించకు, తలుపులూ!

త—సెలవండి స్వామీ, సెలవ్.

దే—ఛీ, పో, పిరికిసన్నాసి శకునపక్షీ!—ఫో. త్వరగా తీసుకురా కుమారసేనాన్ని.

త—(R F కి వెళ్ళగా కుమారసేనం వస్తాడు.)

కు—చిన్నీ, ఏమిటి గ్రంథం?

దే—ఏముందీ, తలుపులుగాడి దుర్జనత్వం, భీరుత్వం, మూర్ఖత్వమూనూ! నాకు ఆ యముడికున్నంత ధైర్యమే కాక పై పెచ్చు అతని మున్నపోతుకి ఉన్నంత స్థైర్యం ఉండబట్టిగాని, లేకపోతే ఈపాటికి వాడు నన్ను మోసేసేవాడు.

కు—అది సరిలే, చిన్నీ. ఇప్పుడు కర్తవ్యం ?

దే—ఇదుగో! (అని సవాల్ ఉత్తరం తీస్తాడు).

కు—''దళవాయి వసంతానికి''—(అని చిరునామా చదివి, గ్రహించుకున్నట్టు రహస్యం నటించి, తెలియనట్టు) ఏమిటిదీ ?

దే—ఇదేనా ? ఇది ఒక సవాల్ (అని, మీసం మీద చెయ్యివేస్తాడు.)

కు—నిజంగా! కొంపతవ్వి, చిన్నీ, వాడితో దెబ్బలాడవు కద!

దే—ఒట్టుబాబీ, దెబ్బలాడితీరతాను. జ్వాలారంగం నాకు బాగా ఉషార్ ఇచ్చేశాడు. ఇందాకా అతడు వెళ్ళిపోయేటప్పుడు నాకు కోపం వంటినిండా ఉండింది. ఇప్పుడు ఒకవీసం తరిగిపోయింది, అనాలి. నేను ఈ సాయంత్రమే పోట్లాడేస్తాను, లేకపోతే ప్రశస్తమైన నాకోపం ఇంకా తగ్గుమొహం పట్టచ్చు.

కు—అయితే, ఈ సవాల్ నాకెందుకూ ?

దే—ఎందుకా! ఆ ఘటాన్ని ఏమాత్రమో నువ్వు ఎరుగుదువుగా! నాగురించి వాణ్ణి వెతికి, ఈ మారణపత్రం వాడిచేతులో పెట్టెయ్,

కు—అయితేసరే. ఇయ్యి, తప్పకుండా వాడికి అంద జేస్తాను.

దే—నీకడుపు చల్లగా, ఇయ్యిబాబూ! దణ్ణంబాబీ నీకూ నీపెద్దలకీనూ! పాపం, నీకు చాలా శ్రమఇస్తున్నాను ప్రియమిత్రమా!

కు—ఏమీా ఫర్వాలేదు. శ్రమకుడానా! ఎంత మాటా! శ్రమ ఎంతమాత్రం లేదు, నామాట నమ్ము.

దే—ఆహా, బాబీ. ఏమి, నీ మంచీ! స్నేహం అనేది ఎంత అమూల్యమోయి!...పోనీ బాబీ, నువ్వు నాకు సహాయుడుగా ఉంటావా ఏమిటి?

కు—అబ్బే, బాగుండదు చిన్నీ. నీతోడుగా నేనుండ కూడదు.

దే—పోనీలే, జ్వాలారంగాన్ని పట్టుగుంటాలే. నువ్వు నీ ఆశీస్సులుమాత్రం నాకు పారెయ్.

కు—ఓ కావలిసినన్ని—వాడు నిన్ను కలుగున్నప్పు డల్లా నా ఆశీస్సులు నీవే.

త—(R F నించివచ్చి కుమారసేనంతో) మీా నాన్న గారు మిమ్మల్ని రమ్మంటున్నారండి.

కు—అల్లానా! వెడుతున్నా! వెళ్ళొస్తానోయ్, ధీరమిత్రం! నీకు దిగ్విజయం కలగాలి.

దే—మాట, బాబీ, మాట. ఆ వసంతంగాడు నిన్ను అడగగలడు—మీా నేస్తం దేవయ్య ఎల్లాంటి బాపతు వాడయ్యా—అని! ఏమని చెప్తావో తెలుసా?—వా డెక్కడా, ఓ యమరాక్షసిపీనుగూ—అని చెప్పాలిస్మీ, బాబీ!

క—ఓ, తెగేసి చెబుతాను. పసికడితే వదలని వేట కుక్కలాంటి వాడని చెబుతాను. చాలా, చిన్నీ ?

దే—ఓ చాలు చాలు చాలు. అట్లానే చెప్పు. దాంతో వాడు తారుకుని, బహుశా దెబ్బలాటకి రానేరాడు, కుంక. మరోటికూడా చెయ్—నేను సామాన్యంగా వారానికి ఓమనిషిని చొప్పున చంపి పారేస్తూంటాననికూడా అని చూడు.

క—ఓ. అల్లా చెప్పితీరతాను. ఓ ఓ. అసలు నీకు పోట్లాట-చిన్నీ అనే బిరుదు ఉంది పొమ్మంటాను.

దే—బలే బలే, అల్లా అను. (స్థాయిగా) కాని, ఇదంతా ఎందుకో తెలుసా, ఏవిధమైన గలిభీలేకుండా చెయ్యడానికి. ఏమంటావా, నా గౌరవం నాకు దక్కితే వాడిప్రాణం తీసెయ్యాలని నాకూ లేదు.

క—నిజమే. నీకు ఎంత క్షమ, పాపం!

దే—అల్లా అంటున్నావేం ? పోనీ, వాణ్ణి చంపెయ్యమంటావా ?

క—అబ్బెబ్బే, వద్దు. పోతాను. (వెళ్ళబోతూ) నువ్వు యమరాక్షసి పీనుగువని చెప్పేస్తా.

దే—మరే మరే. కాని, బాబీ, ఆగాగు. ఇంకోటికూడా నువ్వనచ్చు. నువ్వు నీజన్మలో కనీ వినీ ఎరగని కోపం నాకు వచ్చేసినట్టు—అనగా చుట్టుపక్కవాళ్ళందర్నీ తినేసేటంతకోపం నాకు వచ్చేసినట్టుకూడా చెప్పేసెయ్, పోనీ !

క—(తల తిప్పుతూ) ఓ ఓ.

దే—పసికడితే వదలని వేటకుక్క—మరిచిపోకేం ?

కు—మరవను, మరవను, పోట్లాట—చిన్నీ! (అని గబగబా R F కి పోతాడు. రెండో తెర పడుతుంది.)

[వెంటనే జ్వాలారంగం యోధుడులా అడుగులేసు
కుంటూ వస్తాడ్లాగ రొమ్మువిరుచుగుని మీసం
సర్దుకుంటూ R F నించివచ్చి సకిలిస్తాడు]

జ్వా—ఈ కుమారసేనం ఎక్కడ దాక్కున్నాడో తెలియకుండా ఉంది. కావలిస్తే ఒట్టెడతాను—ఈ యుద్ధో ద్యోగు లున్నారే, వీళ్ళు తక్కినవాళ్ళ ప్రేమ ప్రమేయాల్లో ఎప్పుడూ అడ్డురావడమే, అదేమిటోగాని. నాకేమైందీ! ఈపాటికి ఆ సుప్రభాదేవిని నేను రమారమీ పెళ్ళాడేసుండే వాణ్ణిగదా, ఆ దిక్కుమాలి లుచ్ఛా సేనాధికారి కుంక మూలాన్ని కాకపోతే! వాడేంజేశాడూ! ఆ అమ్మాయి ఓమూల నా మొహం చూడాలి అనుకుంటూండగానే దాన్ని హైసరభజ్జా అని లేవదీసుకుపోయాడు. నాకు మరో ఆశ్చ ర్యం! వాడిలో ఏమి మహత్తుందనో ఈ ఆడఘుటాలు వాడంటే పడి చచ్చిపోతారు. (అని L F కేసి చూసి) ఓహోహో! కుమారసేనం ఇల్లానే వస్తున్నాడు. వాడే! వాడి విజయధోరణి చూస్తే నాకు కాలుకొస్తుంది. ఇక్కడ నక్కి సంగతి కనిపెడతాను. (అని R F కి వెడతాడు).

కు—(విసుగుమొహంతో L F నించి వచ్చి) అబ్బ! నాన్నగారితోసహా అక్కడికి మళ్ళీ వెళ్ళాలిగావును! ఈమాటు సంగతి తేలిపోతుంది! (అని R F కేసి నడుస్తూ) సరే, సంగతి తేల్చేద్దాం.

జ్యా—(R F నించి వస్తూ) ఎల్లా సంగతి తేల్చడం ? ఆగండి. వీలులేదు. ఆవిషయంలో మీ అభిప్రాయానికి నా అభిప్రాయం విరుద్ధంగనక క్షమించాలి.

కు—మీరు అతి సూక్ష్మాలగురించి పోట్లాడేవారులా ఉన్నారు. అప్పట్లో నేను నా అభిప్రాయం ఏమిటో చెప్పందే అది మీకెల్లా తెలిసిందీ ?

జ్యా—క్షమించాలి. మీ రల్లా వాదించి లాభం లేదు. మీ సెలవుప్రకారం చెబుతాను, అనృతం ఆడితే ఎంతో ఆలోచించినా అంతే !

కు—అబ్బ, నిజమేనండీ, సరే. కాని, ఎవడేనా తన ఆలోచన ఎంతమాత్రమూ పైకి చెప్పడనుకోండి. అటువంటి వాడి మనస్సులో ఇల్లా ఉండి ఉంటుంది, అల్లా ఉండి ఉండాలి—అంటూ తక్కినవాళ్ళు ఊహాగానంచేస్తూ గిజగిజ లాడడం ఎందుకొచ్చినపనీ ?

జ్యా—అల్లాయితే, మీకూ నాకు ఎందులో అయితేం, అభిప్రాయభేదం ఉందన్నమాట. ఇదీ, నే నిందాకా అన్నదీ ఓకే !

కు—అయ్యా, జ్యాలారంగంగారూ ! నేను లోగడ మిమ్మల్ని ఎరుగుదును గనక సరిపోయిందిగాని, ఇదే మన మొదటి సమావేశం అయుంటే, మీరు మర్యాదస్తులని నేను కనిపెట్టలేకపోయి ఉండేవాణ్ణి. మీరు నాతో ఎల్లానో అల్లా జట్టీపెట్టుగోడానికి వచ్చినట్టున్నారుగాని, నాకు మరోహాలాగ తోచడంలేదు.

జ్ఞా—తమరింత త్వరగా సంగతి గ్రహించినందుకు, వినయపూర్వకంగా నమస్కరిస్తున్నాను. (అని, తలవంచుతాడు). నా మనస్సులోఉన్నది మీ నేర్చారు.

కు—అయితే సరే. జట్టీగురించి మీకున్న సంకల్పాలు నేను భంగపరచను. కానండీ, తమ హృదయాభిప్రాయం చెప్పేస్తిరా, చాలా సంతోషిస్తాను.

జ్ఞా—సరి సరి. నిదానించండి స్వామీ. జట్టీ ఇదివరకే ఉంది. అది గట్టిజట్టీయేనూ! దాన్ని మనం విశదీకరించడం మొదలెడితే దానిపస చెడిపోతుందికూడానూ! అయినాసరే, చెబుతాను, తమకి జ్ఞాపకశక్తి తక్కువగావును పాపం,—లేకపోతే, మీరు నామీద దాడితీసి వారం తిరగలేదాయె, ఆసంగతి అప్పుడే మరుస్తారా? సరి, ఆసంగతి మరి చాలు. పోట్లాట ఎక్కడ? ఎప్పుడు? చెబుదురూ?

కు—మీకు దెబ్బలాటంటే అంత మక్కువగా ఉంది గనక, ఎంత పెందరాళే అయితే అంత నయం! ఈ సాయంత్రం పెట్టండి, కొత్తవనంలో—ఆటంకపరిచేవారు ఎవ్వరూ ఉండరు.

జ్ఞా—మీరు ఆటంకం అంటే జ్ఞాపకం వస్తోంది. ప్రేమవిషయాల్లో ఆటంకాలు పెట్టేవాళ్ళున్నట్టే పోట్లాటల్లో కూడా ఆటంకపెట్టేవాళ్ళు ఉండకపోరు. అందులో ఈఊరు మరీనూ! ఇట్లాంటి పోట్లాటసంగతి ఏక పాకిపోతుంది, ప్రతీవాడూ నోరుచేసుకుంటాడు, చివరికి పోట్లాడే మహాజనుడు సుబ్బరంగానూ ప్రశాంతంగానూ నిదానంగానూ పోట్లాడ్డానికి

కూడా వీలు చెడిపోతుందికూడానూ. అయితేంలెండి, మీకు చిక్కు లేకుండా ఉంటే, నాయందు ప్రత్యేక దయఉంచి, తమరు రాజమైదానానికి ఆరుగంటలకి రండి. నా కక్కడ మరో రాచకార్యంకూడా ఉంది అప్పట్లో! ఒక్కదెబ్బకి రెండూ కూడా కానిచ్చేస్తాను.

కు—ఓ. అక్కడ నాకూ వీలే. ఆరు కొంచెం దాటిం తరవాత దయచెయ్యండి, మనవిషయంయొక్క లోతుపాతులు తర్కించుదాం.

జ్వా—చిత్తం చిత్తం. అప్పటికి కొంత చీకటి పడ్డా గానీ, తుపాకీ బారెట్టుగోడం ఇబ్బంది అనిపించుతుం దేమో గాని, ఖడ్గా ఖడ్గీ దెబ్బలాటకి ఆ వెలుతురు సరిపోవచ్చును. ఇంతమట్టుకి సంగతి స్థిరపడిందిగనక, ఇప్పటికి నామనస్సు కుదటపడింది. (అని ఠీవిగా L F కి పోతాడు).

కు—సరే. ఒకందుకు మనస్సు సిద్ధపడే ఉందిగా, రెండో అందుకు లెఖ్ఖేమిటీ ? (అని, R F కి పోతాడు. తెర).

## రంగం-5

[రాంభాణమ్మ ఇంటిహాలు, కొన్నికుర్చీలుంటాయి]

రాం——(LM నించి వచ్చి) ఔర ! ఇది మరీ వినిపించుగోకుండా వచ్చింది. (RF కి నడిచి) ఒసే కల్పకం, కల్పకం ! రా, యిల్లారా !

క——(RF నించి వస్తుంది.)

రాం——కూచో, చెబుతాను.

క——(కూచుంటూ) ఇదుగో కూచున్నాను.

రాం——ఓసి రణపెంకీ ! కుమారసేనం అంటే ఆటంకం ఏంచెబుతావో చెప్పు చూస్తానూ ! అతడికి అందం లోటా, నాగరికత లోటా, ఐశ్వర్యం లోటా, చెప్పుమరి ? చెప్పవే అంటూంటే, అల్లా చూస్తావేం కళ్ళప్పగించీ !

క——(తనలో) పాపం, ఈవిడ ఎవర్ని మెచ్చుగుంటోందో ఎరగదు. (పైకి) వసంతంకూడా అల్లాంటివాడే, అత్తా.

రాం——అల్లాంటివాడే అంటూ సహాపత్యం తెస్తున్నావా ? నీయిష్టం యిష్టంలాఉండచ్చుగాని, ప్రతీచోటా ఉపమా చెయ్యడంకూడదు, పిల్లోవ్ ! కన్నెపడుచుకి ఉపమా భర్జించదు, ఏమనుకున్నావోగాని ! ఛీ ! కుమార్రసేనం ఎక్కడా ! అతడు అందాలఘందిరి, మర్యాదమందారం !

క——(తనలో) మరే ! నువ్వుచూసిన కుమారసేనం.

రాం——కుమారసేనం చక్కటి శిక్షణపొందినవాడు. అతడి చాకుశక్యమూ విద్యాసత్తీ మరోడికి వశమా ? అవి

అతడిసొమ్మే. పైగా, అతడిభాష ఎల్లాంటిభాష? అతని వక్త్రారవిందం ఎంత అధికర్షణీయంగా ఉందీ! అసలు అతడు నట్టింట నిలబడితేనే గొప్ప—చంద్రబింబంలాంటి మొహం, చెంపకి చారెడేసికళ్ళు, కోటేసినట్టు ముక్కు, మాంచి సింహావలోకనం—అజానుబాహుడు!

క—(తనలో) పాపం, నిజం తెలియడంతోటే ఈవిడకి ఎంతకోపం వస్తుందోగదా!

[R F నించి ఉళక్కి గబగబా వస్తుంది]

ఉ—మామ్మగారూ! పరాంకుశంగారూ కుమారసేనంగారూ వస్తున్నారండి.

రాం—వస్తున్నారా! రమ్మను రమ్మను.

ఉ—(R F కి వెడుతుంది.)

రాం—విను, కల్పకం! కన్నెపడుచుకి తగ్గరీతిగా నువ్వు పరివర్తించవలిసి ఉంటుందని నేను శాసిస్తూన్నాను. నీ విధాయక కృత్యం నువ్వు మరిస్తే పీడాపోయె, నీ వంశ గౌరవమేనా నిలబెట్టు.

క—అత్తా! నా నిశ్చితం నీకిదివరకే చెప్పేశాను. ఇతడికి నేను ఏమీ ప్రోత్సాహం ఇవ్వను, సరిగదా, ఇతడితో మాటేనా అణ్ణు—ఆమాటకొస్తే, ఇతడి మొహమేనా చూణ్ణు. (అని, L F కి నడిచి, అక్కడి కుర్చీ L కి తిప్పి అందులో ఉసూరుమని కూలబడుతుంది.)

[R F నించి మొదట ఉళక్కి వచ్చి B కేసి తప్పుకుంటుంది. తరవాత కర్రమీద ఆనుకుంటూ పరాంకుశం వస్తాడు. అతడి వెనకాల కుమారసేనం ఉంటాడు]

ప—వచ్చాం రాంభొణమ్మగారూ !

రాం—రండి దయచేసి కూచోండి.

ప—చాలా పెంకిరకం అనిపించిన సుందరియొక్క కోపతాపాలు ఏమన్నా తమాయించాయేమో చూడాలి. ఈ పాడగట్టుని కూడగట్టుకుని రావడానికి నా కెంతవాలో అంతాఅయింది. ఇందులో ఏం తిరకాసుఉందో నాకు తెలియదు. వీణ్ణి తొడ్డోసి లాక్కొచ్చానుగాని, లేకపోతే వీడు ఉడాయించేసేవాడే.

రాం—ఈ వ్యాపారంలో తమరుపడ్డ శ్రమ ఇంతా అంతాకాదు, పరాంకుశంగారు ! ఎంజెయ్యనూ, నాకూ సిగ్గుగానేఉంది. (కల్పకంతో రహస్యంగా) ఒసేవ్, కల్పకం, రా, మరీ! నా చిట్టీ, రా అమ్మా! వచ్చి, పెద్దలకి నమస్కరించు.

ప—ముసలమ్మగారూ! మీ కల్పకం సమగ్రాలోచన చేసుగుని, ఈ వరుడియొక్క విలవా, మేనత్తయిష్టంతో చెప్పిన మాటయందు తనకుండవలిసిన గణ్యతా, నాతో సంబంధంయొక్క ఘనతా కనిపెట్టిందని భావిస్తున్నాను. (కుమారసేనంతో రహస్యంగా) ఒరేయ్, అబ్బిగా, వెళ్ళి ఆ అమ్మాయితో ప్రసంగించు.

కు—(పరాంకుశంతో రహస్యంగా) నాన్నా! మీరు తిన్నగా ఆలోచించండి. మీ రిక్కడ ఉండడంచేత ఆ అమ్మాయి ఇటుకేసి చూట్టమేనా లేదు. ఇటుచూడదని నాకు తెలుసు, నేను మీతో చెప్పానుగా. మీ పాధాలకి దణ్ణం,

మీరు అవతలకి తప్పుకుంటే నయం! (తండ్రిని తప్పుకోమని నయాన్నీ భయాన్నీ చెప్తూన్నట్టు నటిస్తాడు).

క—(తనలో) ఈ వచ్చినాతణ్ణి చూసి మా అత్తయ్య ఇంకా నిర్ఘాంతపోదు ఏం కర్మమో! ఇంకా ఇతణ్ణి చూడ లేదుగావును మా అత్తయ్య! కాకపోతే, ఇతడూ అతడూ ఒకటే పోలికో! అదీ కాకపోతే, మా అత్తయ్యకి రేచీకటో!

కు—(తండ్రిని వెళ్ళిపొమ్మని కోరి, ఆయనకి దారి చూపిస్తాడు)

ప—(వెళ్ళనని సంజ్ఞ చేసి తీవ్రంగా చూస్తాడు).

రాం—పరాంకుశప్రభూ! నా మేనగోడలిమీద నేను ఎంతమాత్రమూ ధిక్కారం చలాయించలేనని చెప్పడానికి చాలా ఇదవుతున్నాను. (కల్పకంతో రహస్యంగా) ఇటు తిరుగు, కల్పకం! నాకే సిగ్గుగా ఉంది.

ప—గొప్ప చెప్పుకోడం కాదుగాని, నా కుమారు డంటే ఇష్టపడకపోవడానికి శ్రీమతి కల్పకం ఏమన్నా కారణం చెప్పగలదా? (కుమారసేనంతో రహస్యంగా) నువ్వు మాట్లాడ్డం మొదలెట్రా అంటే, అల్లా చూస్తూ నుంచుంటా వేమిట్రా, బాబీ! ఛీ మాట్లాడు, నక్కా కానా! మాట్లాడ్రా అంటే!

రాం—ఇష్టపడకపోవడమూ అందుకు ఓ కారణమూ గూడానా! యుగం తిరిగినా ఉండదు. ఉన్నా అల్లాంటి కూతలు పైకి కుయ్యవీలా? (కల్పకంతో రహస్యంగా) ఓసి, లంకిణీ, నోరు తాళం పడిందేమే నీకూ!

ప—ఆ పక్షంలో, ముసలమ్మగారూ, వినండి. ఏదో కుర్రతనపు తొందరలో ఇంకా ఏమీ లేందే గుణకారాలు చేసుగుని కూచుంటారు పడుచులు. అల్లాంటి వాటివల్ల మా అబ్బిగాడి సౌఖ్యానికి ఏవిధమైన ఆటంకమూ వచ్చిపడదని నేను గట్టిగా నమ్ముతున్నాను. (కుమారసేనంతో) ఓరి రాలుగాయి దినుసా! నోరు పెగల్దేమిరా, నీకూ!

క—(తనలో) నాకు మాట్లాడ్డం అంటే ఎంత అయిష్టంగా ఉందో, నా వరుడికీ అంతే అయిష్టంగా ఉన్నట్టుంది.— సంగతి ఏమిటంటే, మా అత్తయ్యకి మహాచిత్రంగా చూపు చెడిపోయి ఉండాలి.

కు—(కల్పకం కూచున్న కుర్చీ వెనకకి సమీపించి, సకిలించి, మాట్లాడ్డానికి యత్నించి, ఏదోవిధంగా మూలిగి, మాటరాక, మళ్ళీ తండ్రిగారి దగ్గిరికొచ్చి) నిజమేనండీ, నాన్నా! ఒట్టు. నేను తెగ కంగారై పోయానండీ—మరి, ఏమిటంటే, తెగ, ఇదై పోయాను. నేను మొదటే చెప్పాను కాదండీ, ఇల్లా అవుతాననీ! నాకిది ముందే తెలుసును. నా ఉద్రేకంవల్ల పుట్టిన వణుకూ—అనగా శరీరకంపం—నాగుండె నిబ్బరాన్ని పూర్తిగా ఆర్చేసింది.

ప—ఆర్చేస్తేం! ఆ వణుకు నీ కంఠస్వరాన్ని నాశనం చేసేసెయ్యదు కాదుట్రా, మూర్ఖా! ఏం? ఛీ, వెళ్ళు. వెళ్ళి ముఖాముఖి మాట్లాడేసెయ్.

కు—(తనసీ కల్పకాన్నీ వదిలివెళ్ళవలిసిందిగా, రాంభాణమ్మకి సంజ్ఞలు చేస్తాడు.)

రాం——ఏమండీ తాతగారూ! మనిద్దరం అటు తప్పు గుంటే! (కల్పకంతో రహస్యంగా) ఎంత శత పెంకివే జిత్తులమారీ!

ప——ఉండండి రాంభొట్లమ్మా! మనం అప్పుడే వెళ్ళి పోకూడదు. (కుమార సేనంతో రహస్యంగా) నువ్వు ఎం జేస్తున్నాట్టురా, నీ ఊరుకోడం ఇద్దై పోనూ! దవడ కద పరా, శుంఠా, దవడ కదపరా!

కు——(కల్పకం కుర్చీ వెనకకి జరిగి చిన్న కీచుగొంతి గతో) నా సత్యప్రేమయొక్క మృదుప్రకటనకి మిస్ కల్ప కం చెవి ఇచ్చి ఊరుకుంటుందా? నా కల్పకం సంకల్పం...

ప——ఏంవొచ్చింది చెప్మా వీడికి! కణికీ బిణికీ మాట్లాడవేంరా? అల్లా తాడిలా నిలబడి పడిశం పట్టిన కప్పలాగ (అనుకరిస్తూ) మెక మెక మంటావేం?

కు——మిమి మీరంటే ఉండే ఆయొక్క భీతావహ మున్నూ నాయొక్క మొహమాటమున్నూ ఏకమై నా కంఠం పూర్తిగా పట్టుగున్నాయి.

ప——ఓహోహో! మళ్ళీ మొహమాట మంటూ మొదలెట్టాడే! ఒరేయ్, అబ్బీ, చెప్పేస్తున్నాను. నువ్వింక ఝుమాయించి వెంటనే మాట్టాడకపోయినా, తేలిగ్గా నాలిక ఆడించకపోయినా, నాకు ఎన్నిపుట్లకోపం వస్తుందో నువ్వెర గవ్! రాంభొట్లమ్మగారూ! మీ శ్రీమతి తన ముఖంలో మరి కొంత భాగంయొక్క దర్శనం మాకు ప్రసాదించాలని కోరుతున్నాను.

రాం—(వెళ్ళి కల్పకాన్ని కొంత కసురుకున్నట్టు నటిస్తుంది).

కు—(తనలో) సరే. ఉన్న సంగతేముటో బయట పడిపోతుంది గావును. కానీ! (కల్పకం దగ్గిరికి వెళ్ళి—ప్రకాశంగా) ఆట్టే ఆశ్చర్యపడకు, ప్రియకల్పకం! కాస్సేపు ఆశ్చర్యాన్ని అణిచిపెట్టి ఉంచు.

క—(తనలో) అయ్యో దైవమా! వసంతం గొంతిగే! వసంతం పరాంకుశంగారికి కుడా టోపీ వేసెయ్యలేదు కద! (తల క్రమక్రమంగా తిప్పి చూసి, ఆశ్చర్యంతో వెనక్కి తగ్గి) ఇది సంభవనీయమే! నా వసంతం! ఇదెట్లా జరిగిందీ! నా వసంతం!

కు—(తనలో) అయ్యో, కొంపమునిగిపోయింది.

ప—వసంతమా! సైతానువసంతం లేస్తూ! ఏమిటి ఈ పిల్ల తాత్పర్యం? ఓ అమ్మాయోయ్! ఇతడు మా అబ్బాయి, మా బాబీ, కుమారసేనం.

రాం—ఓసి కల్పీ, నీసిగ్గు చిమిడిరిక దే నీసిగ్గు చిమడా! నీ మనస్సెప్పుడూ ఆ మాయధారి వసంతం మీాదేగామరీ, అంచేత ఆకుంక నీ కళ్ళఎదట ప్రతినిత్యమూ తాండవిస్తూంటాడు గావును! సెబాసు! అహోరించావుగాని అప్పుడేను, ఈ బాబీ కుమారసేనంగారిక్కి నీ క్షమాపణ తక్షణం దాఖల్చేయ్.

ప—తస్సాగొయ్యా, పిల్లకి ఏదో పిచ్చెత్తింది. నవలలు చదివేసరికి మెదడు పట్లికొట్టింది.

రాం——నా ప్రమాణంగా నా నమ్మకమూ అంతే. ఓసి, పైత్యకారీ, వసంతం అంటావేమిటే? నువ్వు క్రితంసారి చూసిందీ కుమారసేనమే, ఈసారి చూస్తూన్నదీ కుమారసేనమే. కుమారసేనం అంటే మూడుమూాతులా ఈయనే. కాబోతూన్న ముగుడునీకు.

క——అత్తా! ఆత్మసాక్షిగా చెబుతాను—నా వసంతాన్ని నేను తిరస్కరించగలనా?

ప——అబ్బో అబ్బో! ఈపిల్లపిచ్చి చాలా హెచ్చుస్థాయిలోఉంది. లేక, ఈ సన్నాసి ఏమన్నా లుచ్ఛావెత్తులు వేసి నాటకం ఆట్టంలేదుకద! ఒరేయ్, భడవా, ఇల్లారా! ఎవడవురా నువ్వూ?

కు——నిశ్చయంగా చెబుతున్నాను, వినండి. ఆసంగతి నాకే పూర్తిగా విశదం కావటంలేదు. కొంచెం జ్ఞాపకం చేసుగోడానికి యత్నిస్తాను.

ప——యత్నిస్తావ్? ఓరి చెవలం, యత్నమేమిటీ? నువ్వు మా అబ్బాయివి కావురా?—నా లెఖ్ఖ నీకు లేకపోతే, మీ అమ్మనేనా తల్చుగుని చెప్పరా, జాగిలంకానా!

రాం——మరేమరే. స్వామీ, మీరెవరో చెప్పండి, బాబూ. అయ్యో, దైవమా, నాకూ అనుమానంవేస్తోంది.

కు——నాన్నగారూ! నేను నిశ్చయంగా మీ యిల్లాలి పుత్రుణ్ణి. మీకుకుడా పుత్రుణ్ణే అయినట్టు నా హృదయ పూర్వకంగా నేను నమ్ముతూన్నసంగతి నా ప్రవర్తనవల్ల విశదంచేస్తూనే ఉన్నానుకదండీ! రాంభాణమ్మగారూ!

నేను తమ సవినయారాధకుణ్ణి. మరి త్వరలో మీ మేన
గోడలి పెనిమిటి కానున్నందుకు గర్విస్తున్నానుకూడానూ.
సరి, కల్పకానికి నాసంగతంతా తెలియనే తెలుసును. నేనే
ఆ విశ్వాసపాత్రుడైన వసంతాన్ని! కల్పకం విశిష్టమైన
ఉదారస్వభావం గలదిగనక, నేను స్వయంగా ఆరోపించు
గున్న అల్పపదవిలో ఆమె నిష్కారణప్రేమకి పాత్రుణ్ణై,
యథార్థమైన నా అధికస్థితిలో ఆ ప్రేమయొక్క సంపూర్ణ
ఫలం పొందవచ్చునని ఆశించాను.

క—(తనలో) అల్లాయితే, చెప్పకుండా ఇంట్లోంచి
పారిపోవడంలాంటి మజా ఏమీ ఇక ఉండదన్నమాట!
(అని నిట్టూర్పు విడుస్తుంది.)

ఫ—ఒరేయ్! నువ్వొక్కడో మహాటక్కరి నక్క
లాగ కనిపిస్తావే! కాని, ఏమాటకామాటే చెప్పాలోవాలి,
నమ్మించి దగా చెయ్యడంలో నీకంటె ఆరిందాటక్కరిని
నేను చూడలేదు.

కు—ఏమిటో, నాన్నగారు. నన్నుమరీ ఉబ్బేస్తు
న్నారు, మరీ అభినందిస్తున్నారు. నా మొహమాటమండీ,
మీకే తెలుసూ, నా మొహమాటమేనండీ ఆదినించీ నాకు
ప్రతిబంధకమైపోతా!

ప—పోనీలే, ఎక్కడికక్కడికే సంతోషం. నువ్వో
ఉసూరుమంటూఉండే బురదకట్టై దళవాయిగా నటించావే
గాని, అసలుకావుగా! నీతండ్రిని నువ్వు గాడిదని చేసేసి
నందుకు సంతోషమేరా, గాడిదీ, సంతోషమే! ఓరి
నీ నటన ఊరేగించా! ఇదా నీ పశ్చాత్తాపం, ఇదా నీ పుత్ర

ధర్మం, ఇదా నీ శిరసావహింపు! అరే! నేనప్పుడే అను కున్నాను, ఈ కొత్తలక్షణాలన్నీ ఇంత అకస్మాత్తుగా ఎల్లా బయల్దేరాయా, అని! నువ్వు పూర్వం వీళ్ళసంగతే విన్లేదు కాదూ, పాపం, కూచన్నవి! ఏం, ఏమీ విన్లేదు కాదూ! వాళ్ళది జాజినగరం కాదుటండీ, అంటావు! ఈ విష యంలో నన్ను సంతోషపరచగలిగితే అదే నీకు వెయ్యి వేలేం? ఆరినక్కా! మాయలమారి లుచ్ఛా! హావ్వ హావ్వ. ఏమన్నావ్? (కల్పకాన్ని చూపిస్తూ) పిల్లకి మెల్ల కన్నా? ఇల్లాచూస్తుందీ? పొట్టిగా తుప్పతలవేసుగుని ఉంటుందీ!—ఓరి దగుల్బాజీకుంకా! ఔరఔర! సిగ్గుతో ఇద్దైపోకుండా, తలెత్తుగుని ఎల్లా ఇదవుతున్నావోగాని!

కు—చాలా కష్టంతో తలఎత్తుగుని తిరుగుతున్నా నండి. నేనసలు కంగారుపడిపోయానండి, బలే కంగారు! మీరు గమనించేఉంటారు.

రాం—హా దైవమా! అయ్యో పరాంకుశంగారూ, ఉండండి, నా హృదయాండగోళంలో ఒక కొత్తవిషయం హఠాత్తుగా గోచారం అవుతోంది. ఆఁ ఆఁ. అయితే సేనాని గారూ! తమరేనా ఆ ఉత్తరాలు రాసినవారు? ఔర! నన్ను వర్ణించడంలో పగలుచూస్తే రాత్రి కల్లోకివచ్చే ముసిలితాకాసి అమ్మవారు—అని మీరు చేసిన లలిత వచన పచనంగురించి మిమ్మల్ని నేను అభినిందించ వలిసిందే అంటారా? నా భాషాభూషణాలగురించి విచారించినవారు మీారేనా?

కు—అయ్యో! మీరు అభయహస్తం ఇవ్వకపోతే, నాసిగ్గు నన్ను బొత్తిగా అణగార్చిపారేస్తుంది. ఇక నేను భరించడం కష్టం.

ప—ఉండండి, ఉండండి, రాంభాణమ్మగారు. మీరు కొన్నికొన్ని మరిచిపోతూండాలి, కొన్నికొన్ని పోస్ పొస్మని చప్పరించిపారేస్తూండాలి. జీవితంచిత్రం! చిటికెలో ఎంత తమాషాపరిస్థితి ఏర్పడిందీఅంటే, నా హృదయ మంతా సారస్యంతో నిండిపోయింది, నా ఉత్సాహం చెలరేగింది, ఏమంటారు, రాంభాణమ్మగారూ!

రాం—పోనీ, అల్లానే కానీండి, పరాంకుశం గారూ, మీకోరిక అల్లాఉందిగనక! మనం భూతకాలం గురించిన అంచనాలు ఏమీ వెయ్యవద్దు. అందుకని, ఏమంట్రోవ్, పిల్లలు—మన స్మరణ యావత్తూ భవిష్యం గురించే.

ప—వాళ్ళిద్దరూ ఉంటారు, మనం నిష్క్రమింతాం, రండి, రాంభాణమ్మగారూ! ఒకరిదగ్గిరికి ఒకరు వెళ్ళి పడా లని వీళ్ళ మనస్సులు ఉయ్యాలలూగుతున్నాయి—అని నా నిశ్చయం. రండి. ఏరా బాబీ, ఆ దవడ నే చెప్పినట్టులేదూ? (తల తిప్పుతూ) ఊం? నేత్రాలు? చెప్పరా, ఫుంధాకోర్, చెప్పవేం? పెదవి? ఏం? రండి, రాంభాణమ్మగారూ! వీళ్ళ సమావేశంలో ఉండే సున్నితత్వం మనం చెడకొట్టద్దు. సౌఖ్యానికి కాలం వాళ్ళదీ!

జన్మ జన్మంతకీ
సార్థకం యవ్వనం

సౌఖ్యాల అనుభవం
అప్పుడే దొరకడం

ఔర ! జీవితం మహాచిత్రం ! నాకు ఎంత ఉషార్‌గా ఉందో ! నే నిప్పుడు చెయ్యాలేంది లేదు. క్షమించాలి, రాం భాణమ్మగారు, రండి (అని, ఆవిడ చెయ్యి పట్టుగుని, పై పాట లయయుక్తంగా పాడుతూ, మధ్య మధ్య సంగతులు విసురుతూ, సరగములు వేస్తూ, R F కి వెడతాడు).

[L F దగ్గిర కుర్చీలో L కి తిరిగి కల్పకం
కూచుని ఉంటుంది]

కు—(కుర్చీ సమీపించి) చాలా గంభీరంగా ఉన్నావ్, కల్పకం !

క—అయ్యో !

కు—అదేంమాట, కల్పకం ! మన శపథాలూ ఫలించి, పెద్దల అనుమతీ లభించి, మనఒళ్ళో సౌఖ్యమూ పడబోయే ఈక్షణంలో—నువ్వు—

క—మరే మరే, పెద్దల అనుమతి !

కు—అబ్బ, అదేమిటి కల్పకం ! మనం మన ఊహా ప్రపంచంలోంచి కొన్ని మెట్లు దిగాలి—అక్కట్టే అక్కర్లేదు, కొన్ని. దిగితే, సౌఖ్యాన్ని చేపట్టవచ్చు. ఇక ఆస్తి అంటావా, ఉన్నారుగదా, లాయర్లు......

క—ఆఁ లాయర్లు. లాయర్లంటే నాకు అయిష్టం.

కు—పోనీ, ఆ తంతు జరిగేవరకూ మనం ఆగద్దు. తక్షణం వెళ్ళి వివాహానికి అంగీకారపత్రం తీసుగుందాం.

క—ఆఁ, అంగీకారపత్రం ! పోదూ, ఆపత్రం నాకు అపవిత్రం !

కు—ప్రేయసీ, అంత నిర్దయవద్దు. (మోకరిస్తూ) ఇల్లా నిన్ను ప్రార్థిస్తున్నాను.

క—ఇష్ ! మోకరించడం ఎందుకూ ? ఇందులో విశేషం ఏమిటీ, నేను నీదాన్ని అయితీరానని నీకు తెలిసి పోయినప్పుడూ ?

కు—అది కాదు, యువతీ ! నీ అభిలాషలగురించి ఆటంకాలు ఉండవని నేను వాగ్దానం చేస్తున్నాను. నీ మనస్సే నాది కాకుండా పోయినప్పుడు, మరి నాకు ఏమీ అక్కర్లేదు.

క—(లేచి) అయితే వినండి, స్వామీ. మొహం మీద అనేస్తున్నాను. తమరు దగాచేసి, వేషంవేసి, నా హృదయం హరించారు—నీచంగా ! నన్ను ఒక పసిపిల్లనిగా కట్టి, నా ఊహానందాన్ని చప్పరించి, మీ విజయంగురించి తెగ నవ్వుకుంటున్నారు గావును, పాపం !

కు—నన్నుగురించి దురభిప్రాయ పడుతున్నావు, కల్పకం, దురభిప్రాయ పడుతున్నావు. కొంచెం, ఇటు, విను, మరి.

క—వింటూ వింటూ ! తెలిసిందిగా. నేను పిచ్చి దాన్నై, నా ఊహలు నేను చేసుకుంటూ, నా వాళ్ళని నేను దగాచేశానుగదా—వీళ్ళని మించిపోయి వీళ్ళని రెచ్చ గొట్టానుగదా, అని నేను నాలో మురిసిపోతూ ఉండగా అఘాత్తుగా నా ఆశలన్నీ ఒక్కసారిగా నేలబడిపోవడ మూనస్తా నాకు నేనే టోపీ వేసుకున్నట్టు తేలడమూనా !

(ఇటూ అటూ చాలా తొందరగా కాలుకాలినట్టు నడుస్తూ) ఇదుగో చూడండి (అని వసంతం చాయ ఒకటి తీసి) ఇది వసంతం ఛాయాపటం! పగలనక రాత్రనక బెదిరింపు లనక అర్థింపు లనక, దీన్ని నేను ధరిస్తున్నాను. ఇదుగో, చూడండి. ఇది అవతల పారేస్తున్నాను—ఇల్లానే అతణ్ణి గురించిన భావాన్ని హృదయాన్నుంచి విసిరేస్తున్నాను. (అని అది పారేస్తుంది).

కు—ఓ యువతీ, ఆవిషయంలో నేనూ అంతే. ఇదుగో, (అని ఒక ఛాయాపటంతీసి) ఇదుగో కల్పకం! ఈ పటంచూడు. నా కోరికలకి దివ్యాంగీకారమున్నూ నా ఆశ లకి చైతన్య—ఉత్సాహాలున్నూ ఇచ్చే ఈ చిరునవ్వుచూడు! ఈ పెదవులుచూడు, శపథపూర్వకంగా ఇవి వేసిన ప్రేమ ముద్ర ఇంకా తడి ఆరలేదు. ఈ చెక్కిళ్ళుచూడు, నిన్ను అభినందించాలనే నా తొందరని అరికట్టడానికి నునుసిగ్గుతో తటపటాయిస్తున్నాయి. సరి సరి. అదంతా పూర్వం. అదంతా గతం. అయితే, విను. అందంలో ఈ ఛాయ నీకు తీసికట్టేగాని, గణ్యతలో నీకంటె అధికంగనక, నేను దీన్నించి ఎంతమాత్రమూ దూరం కాజాలను. దీన్ని హృదయ సమీ పాన్నే ధరిస్తూంటాను. (ధరిస్తాడు)

క—(కొంత తగ్గి) ఇదంతా మీరు చేతులారా చేసు కున్న దేనూ !...మీరు...మీరు...తృప్తిపడ్డారని...అను కుంటాను...అనుకుంటాను...

కు—ఓ, చాలా తృప్తిపడ్డాను. మోహపాశంలో చిక్కుగోడంకంటె, ఇదే చాలానయం. (అని, నవ్వుతూ)

ఇందులో కొంత ధీరత్వమేనా ఉంది—వాగ్దానాలు రద్ద యితేం, శపథాలు భగ్నమైతే—అబ్బే, అందులో ఏముందీ, నుస్వైరగవాయేమిటి! కాని, రేపు జనం ఏమంటారూ, ఆ అమ్మాయికి, పాపం, మనస్సు మనస్సులో లేదుగావును, అంటారు, తప్పకుండా! మనం చప్పరించి ఊరుకుంటేసరి. లేకపోతే, బహుశా, కొందరు దుష్టులు ఏమనవచ్చో తెలుసా? ఆ దళవాయికి ఈ భామంటే విసిగెత్తి వదులు కున్నాడుగావును—అంటారు. అయినాసరే, నువ్వు లెఖ్ఖచెయ్య కుండా ఉంటేసరి.

క—అయో అయ్యో! ఇంతలేసి మాటలు పడడం దుర్భరం, దుర్భరం (అని మొహం చేతుల్తో కప్పుగుని గొల్లుమంటుంది).

రాం—(R F నించి వస్తూ) ఆపండి మీ కలకలం, మీ కలరవం కాస్సేపు ఆపండి.

క—నీ కుట్రకంటేనూ నీ మోసంకంటేనూ కుడా నీచం ఈ మాటలు, కృతఘ్నుడా! (అంటూ వెక్కి వెక్కి ఏడుస్తుంది).

ప—(L F నించి వస్తూ) సంగతేమిటి చెప్మా! అయ్యో దేవుడా! రాంభాణమ్మగారూ, ఇల్లాంటి కలకలమూ ఇల్లాంటి కలరవమూ ఎక్కడా చూడలేదే, ఇది మహా విప రీతంగా ఉంది, చాలా ఆశ్చర్యంగా ఉంది.

కు—ఆ అమ్మాయినే అడగండీ.

రాం—దైవమా! నామట్టుకు నేను ఆశ్చర్య చుళికి తనై పోయాను. ఏం, కల్పకం, చెప్పు. ఎందుకు అల్లా ఇడవుతున్నావు?

క—ఆ అబ్బాయినే అడగండి.

ప—(సకిలించి) ఆ ఆ, నేనుగాని పిచ్చికోసంలో పడ్డానంటే, జాగర్త ! ఏంరా, బాబీ, చెప్పు. తీరామోసి, నువ్వు మరోవ్యక్తివని తేలలేదుగదా, కొంపతవ్వి ?

రాం—నీదగ్గిర ఏదేనా మాయ పక్షిణీ విద్య ఉందేమో, పెందరాళే చెప్పు నాయనా ! రకరకాలుగా కనిపించే పంచజనుడివి కావుగదా !

కు—అయ్యో అవస్థ ! నామాట నన్ను చెప్పనియ్యరేం ? ఇందుకు కారణం నాకంటె చక్కగా ఆ అమ్మాయే విశదం చెయ్యగల్దు.

క—అత్తా! వసంతంగురించి మళ్ళీ ఇక స్మరించవద్దని ఒకప్పుడు నువ్వు నన్ను శాసించావు. ఈ మహానుభావుడే ఆ వసంతం. ఇప్పుడు నీ ఆ శాసనం శిరసా వహిస్తాను. ఈ క్షణంనించి వసంతాన్ని మనసారా వదులుకుంటున్నాను. (అని L F కి నిష్క్రమిస్తుంది).

రాం—ఔర ! చోద్యం, విడ్డూర్యం, మహాచిత్రాలన్నినీ ! ఎల్లా మారిపోయింది వ్యవహారమూ ! ఏమయ్యా, సేనానీ ! నా మేనగోడలియెడల నువ్వు అమర్యాదగా ప్రవర్తించలేదుకదా !

ప—(నవ్వుతూ) అదా అదా అదా ! తెలిసింది, తెలిసింది. ఇప్పుడు బోధపడింది. ఏరా, బాబీ ! (నవ్వు మొహంతో) నువ్వు మేం లేనప్పుడు చాలా చలాకీగా ఉన్నావుగావును, అంతేనా ?

కు—లేదండీ, నా న్నా. ప్రమాణంగా...

ప—అబద్ధంవద్దు. ఒప్పేసుగో బాబీ. నిశ్చయంగా అంతే అయిఉంటుంది.

రాం—చాల్లే ముసలయ్యా, సేబాసు! చాల్లేస్తూ సేనానీ!

కు—నా ప్రమాణపూర్తిగా ఏమీ లేదండి.

ప—అబ్బ ఊరుకోవోయ్, పెద్దక్షమాపణ ఎందుకూ ఈమాత్రం భాగ్యానికీ! ఈ మోస్తరుగా వ్యవహరించింది నువ్వేకాదు, వెనకట్లో మీ నాన్నా అంతేరా, పుంఢాకోర్, మీ నాన్నాఅంతే! నాకు చాలాపూర్వంనించీ మన వంశంలో జనానికి ఇటువంటి తొందరేట! అదా (అని నవ్వుతూ) పాపం వెర్రిపిల్ల, చిన్నికల్పకం! దాన్ని బొత్తిగా హడలగొట్టేశావుగావును, బాబీ!

కు—లేదండి, ఎంతేనాఒట్టు.

ప—ఛీ మరి మాట్లాడకు. రాంభాణమ్మగారు మీ యిద్దరికీ సాసాయింపుచేస్తుంది. రాంభాణమ్మా! మీరే ఈ రాజీ చేసిపెట్టాలి. కాస్త తమాయించిన తరవాత పిల్ల దాన్తో చెప్పండి—మా అబ్బిగాడిమోస్తరే అంత—అని, నా మోస్తరూ నా పూర్వీకుల మోస్తరూకుడా అంతేఅని చెప్పండిస్మీ. రా, బాబీ, రా! వెళ్లొస్తాంఅండి. (అని, కుర్రాణ్ణి ముందు నడిపిస్తూ R F కి వెళ్ళిపోతాడు.)

రాం—చాల్లే ముసలయ్యా! సేబాసు, చాల్లేస్తూ, సేనానీ! (అంటూ L M కి పోతుంది.) (తెర)

---

## రంగం-6

[రెండో తెర ఎదట, రాంభాయమ్మా, కల్పకమూ, ఉళక్కీ ఒకరితరవాత ఒకరు R F నించి వస్తారు. వాళ్ళ వెనకాల ఆకాశమూ తలుపులూ వస్తారు.]

రాం—అల్లా చెప్పుమరీ! మంచిపనే! మహామంచి పని జరుగుతోందిగా! ఆ మైదానంలో ఆత్మహత్యా పరహత్యా కత్తినాట్యమూ అన్నీ జరుగుతున్నాయి. ఆ దారుణప్రణయం అరకట్టడానికి పరాంకుశంగారు కనిపించడాయిరి!

క—(ఆశ్చర్యంతో) ఏమిటత్తా? ఏమిటి జరుగుతూంటూ?

రాం—నీకేం తెలుసే కూతురా! నిజమేనే. ఈ సంగతి యావత్తూ నాతో బహిష్కరించినవాడు ఆయన! (అని ఆకాశాన్ని చూపిస్తుంది) చెబుతాడు, విను.

క—అయ్యా, సంగతేముటో సెలవిస్తారా?

ఆ—(తాపీగా) అమ్మా! చెప్తా వినండి. ఈ వ్యవహారంగురించి మీఅంత చెవికోసుగునేవారు నన్నడిగినప్పుడు ఆ వృత్తాంతం సమూలంగా నా చాయశక్తులా మీకు నివేదించడంలో నేను క్షణమాత్రాలస్యం చేసినప్పటికిన్నీ, అది ఏమని అనిపిస్తుందంటే, సంఘజీవి నేర్చిఉండవలిసిన మర్యాదలలో ఒఖటీకుడా నాకు అలవడలేదా అని నేనే ఒప్పుగోవాలా అనిపిస్తుంది.

క—అయ్యో అయ్యో! ఇంత డొంకతిరుగుడు ఎక్కడా ఉండదు. అత్తయ్యా! నువ్వు చెప్పేస్తూ, సంగ తేమిటో.

రాం—సంగతా? సంగతికేముందీ! కూనీయే సంగతి, హత్యేసంగతి, హంతవ్యమే సంగతి! ఆ సంగతి గురించిన లోవయినమూ విశేషణవిశేషాల్యలూ ఆయన మనవిచేస్తారు.

క—అల్లానా! అయితే, స్వామీ, తమరు టూకీగా శెలవివ్వండి.

ఆ—అమ్మా! ఆ పక్షంలో సెలవిస్తాను, వినండి. జరగబోయేది కూనీఅని నేను పూచీపడలేను. అది హత్య కావచ్చునాఅంటే, హత్యాకావచ్చు, తీరామోసి నర హత్యా కావచ్చు, తరవాత పంచాయితీవాళ్ళు ఎల్లా తీర్పు చేస్తారో దాన్నిబట్టి ఉంటుంది, దానిపేరు.

క—అబ్బబ్బబ్బ! సరేనయ్యా, నీ ధోరణి సంతకెళ్లా! ఈ జగడంలో ఎవ రెవ రున్నారూ?

ఆ—ఈ జగడంలో ప్రమాణికంగా, ఒక చక్కని యువకు డున్నారండి. ఆయనకి ఇందులో ఏమన్నా జరిగిందంటే, నా అంత ఏడిచిపోయేవాడు మరి ఉండడు. ఆయన సత్ప్రవర్తనగల సాత్వికుడు. ఆయనా నేనూ కలిసే ఉంటాంకుడానూ, ఒక్కమాటైనా మేం మాటా మాటా అనుకోలేదు.

క—ఆయన ఎవరయ్యా మహాప్రభూ! ఆయన ఎవరు, ఎవరు, ఎవరు?

ఆ—ఆయనేనాండీ ! ఆయన నా యజమాని, తల్లీ, నా యజమాని. ఆయన నా యజమానే కాకపోతే, నే నెందుకు మాట్లాడతా నిప్పుడూ !

క—అయ్యో దేవుడా ! కుమారసేనానిగారా ?

రాం—మరే మరే, కల్పకం. ఇప్పుడు వేస్తోందా నీకు భయం ?

క—సరేనయ్యా, ఆ దెబ్బలాటలో ఇంకా ఎవరున్నారు ?

ఆ—అమ్మా, మిగిలిన సంగతులు ఆమూలాగ్రంగా ఈ మహానుభావుడు నాకంటె ఎక్కువగా చెప్పగలడు.

క—(తలుపులుతో) అయ్యా, చెప్పండి.

త—(రహస్యం మాట్లాడుతూన్నట్టు మధ్య మధ్య గొంతిగ నొక్కుగుని మాట్లాడుతూ) అమ్మా, గమనించండి. ఏ ఒట్టుబడితే ఆ ఒట్టు. కుట్రజరిగి వ్యాపించిపోతోంది. లేకపోతే, అంతమంది జనబాహుళ్యం సరదాకోసంటండీ ఆ ఆగ్నేయ సామగ్రి, ఆ ఆగ్నేయ ఆయుధాలు, ఆ ఆగ్నేయ యంత్రాలు, ఆ ఆగ్నేయ యవనికలు, ఆ ఆగ్నేయ కోశాలు—ఇంకా ఏవేవో పేలాపన పదార్థాలు, వాటిమొహం కాల్చా—అవన్నీ పట్టిగెళ్ళడమూ ! (రహస్యంగా) ఏమండోయ్, అమ్మాయిగారు ! వాళ్ళందరికీ ఏదో కోపం వచ్చిందని నా అనుమానం.

క—సరేనయ్యా, మహారాజ ! కుమారసేనంగారు కాక, ఆ యుద్ధంలో ఇంకా ఎవ రెవ రున్నారో రక్షించి చెబుదూ !

త—మా యజమాని ఉన్నారండి. ఆసంగతి మొద ట్లోనే చెప్పడం చాలా ఇదిగా ఉంది. నన్నెరుగుదురా, గారు. అమ్మాయి? నా పేరు తలుపులు మా యజమానిపేరు దేవయ్యగారు ప్రస్తుతం, బహుశ! వెనక అంతే మరీ! వారుకాక అక్కడ కృపాకరంగా రున్నారు!

క—ఇంకేం? సజ్జు సజ్జుంతా ఉన్నారన్నమాటే! అది ఆపేసివద్దామా, అత్తా?

రాం—ఛీ, పో. ఆపేస్తే సమంరసంగా ఉంటుందా మరీ! వాళ్ళ కాగ్య కర్మం పూర్తిగా భంగుపరిచిన వాళ్ళం మనం అవుతాం.

త—అల్లా అంటారేం, అత్తమ్మగారూ! యథా శక్తిగా కొన్నిప్రాణాలేనా తమరు రక్షించకూడదా! నా మాట నమ్మండి, వాళ్ళంతా ఎందుకేనా తెగించేసి వెళ్ళారు—అన్నింటికంటె పెద్ద ఉప్పెన ఏమిటంటే, వాళ్ళల్లో పరగడుపుని పచ్చినెత్తురు తాగే కిరాతు డున్నాడు, జ్వాలా రంగ ప్రభువు!

రాం—జ్వాలారంగ ప్రభువా? హా దయలేదా దైవమా! నా చిన్నారి జ్వాలారంగాన్నికూడా వాళ్ళు ఆ అగ్గిసంబరంలోకి ఈడ్చారా, దైవమా! అల్లా చూస్తూ నుంచుండిపోయావేం కల్పకం! ఆడకూతురివి కావూ?

క—మరి కర్తవ్యం ఏమిటి, అత్తా!

రాం—ఏముందీ! గబగబా వీలైనంత విస్సాటంగా అక్కడికి వెళ్ళి వాల్దాం, ఆ అల్లరి ఆపేద్దాం!—ఏమయ్యా, అబ్బాయి, ఆ యుద్ధరంగం ఎక్కడో నువ్వు మాకు చూపించగలవా?

ఆ—చిత్తం చిత్తం. విధాయకంగా తీసికెడతాను, రండి. తలుపులుగారూ! మీరెళ్ళి ఆ ముసిలిపరాంకుశం గార్ని వెతికి పట్టుగోండి.

రాం—రండర్రా! ఈయన మన్ని అక్కడికి తీసికెడతాడూ!

ఆ—(తలుపులుతో) మీరు (L F చూపించి) ఇల్లా వెళ్ళి పడమటకి పోండి. మేం నేరుగా యుద్ధరంగంకేసి వెడతాం.

త—(L F కి నడుస్తాడు.)

రాం—అయ్యా, రండి. మీరే ముందునడిచి మా కందిరికీ మార్గదర్శిగా ఉండాలి. మీవెనకాలే మేం తిరోగమిస్తాం.

ఆ—అబ్బాబ్బా, ఎంతమాటా! స్త్రీలు ఉంటూండేటప్పుడు ముందడుగు వెయ్యడానికి నేను ఏమిచ్చినాసరే ఒప్పుగోను.

రాం—సరేపోనీ, ఆ కలహభూమి నీకు తెలుసా?

ఆ—ఓ. తెలుసునసే నానమ్మకం, ముసలమ్మగారూ! అసలు మనికి మరో సదుపాయంకుడాఉంది, మంచిది. అదేమిటంటే, మనం ఆ ప్రాంతం సమీపించినకొద్దీ మనికి ఆ ఘోరంగుల పేలాపన వినపడుతుందిగా! దాన్నిబట్టేనా ఆ స్థలం మనం గుర్తించలేకపోతామా! అందువల్ల, రండమ్మారండి, ఏమీ భయంలేదు, దాగ్లో భయం ఎంతమాత్రంలేదు. (అంటూ L F కి నడవగా, అంతా వెడతారు.)

[వాళ్లావెళ్ళగానే R F నించి, చొక్కాలోపలకత్తి దాచి పట్టుగుని దిక్కులు చూసుగుంటూ కుమారసేనం వస్తాడు.]

కు—(తనలో) ఈ విలాసపురంలో ఎక్కడేనా ఖడ్గం కనిపించేసరికి, వార్త ఊరంతా అంటుగుని, జనం, పిచ్చి కుక్కని చూడ్డానికి పోగడ్డట్టు పోగడతారు. అబ్బ! ఈ కృపాకరం రాకపోడం మనసుకి ఎంత బాధగాఉందో! అతడు సకాలంలో ఎన్నడూరాడు. చివరికి అతణ్ణి నిరాశ చేసుగుని నేను ఒంటరిగానే వెళ్ళితీరాలిగావును. (వెనక్కి చూసి) ఓయి కర్మమా, దిక్కుమాలి ప్రాలుద్దం, మానాన్న గారు ఈ దార్నే వస్తున్నాడు. ఈపులి నోట్లోంచి ఎల్లానో వెలువడడం!

[అతడు మొహంమీద ముసుగువేసుగుని, R F నించి పరాంకుశం రాగా, తను వెనక్కితిరిగి, R F కేసి వెళ్ళి పోడానికి యత్నిస్తాడు.]

ప—(ముసుగు మనిషికేసి పరకాయిస్తూ) మధ్య దూరం కాస్తంత ఎక్కువయేసరికి ఎల్లా దగాపడిపోతానో! వీడు నన్ను ఎరుగున్నట్టే లేకుకనకగాని, లేకపోతే వీడు మా బాబీ అవి ప్రమాణాం చేసేద్దును. ఔర! లోకం, ఎంతచిత్రం, అరె బాబీయేగావును, బాబీ, అల్లా భయపడు తున్నావేం, అమ్మా! నాది పొరపాటు కాదనుకుంటాను, బాబీ, ఒరేయ్! (అంటూ వాణ్ణి సమీపిస్తాడు.)

కు—(కీచుస్వరంతో) అయ్యా, నిజంగా, గెల్చిన వారు మీరే, ఓడినవాణ్ణి నేనే. కాని, తమర్ని లోగడ చూసి ఉండడం అనే గౌరవం నేను పొందలేదు—నా పేరు శరభదాసు, విధేయుణ్ణి.

ప—అల్లానాండీ, అయితే క్షమించండి. నేను... మావాడేమో...ఏది...మా బాబీయెమో...అయినా సరే గాని, ఒఖ్ఖమాటుండండి, స్వామీ! (అని నఖశిఖపర్యంతమూ తభిసీలుగా చూసి) ఓరి నీ బొడ్డుపొక్కా, నీమాటలుమండా, నీకీచు సన్నగిల్లా, నీ శరభదాసు ఊరేగించా, విధేయుడివా?...సరేగాని, ఓరి ఫుంఢాకోర్, ఇల్లాంటి వేషాలు మొదలెట్టావేం?

కు—అబ్బే ఊరికేనండి, నాన్నా, ఒఠ్ఠి తమాషాకోసమండీ! అసలు నిజంచెప్పాలంటే, మిమ్మల్ని కలుసుగోవాలనే వచ్చానండి.

ప—అల్లానా! సరే. నీ పుణ్యాంపుచ్చింది, నే కనిపించాను, బాగానేఉంది ఇంతమట్టుకి. సరేకాని, ఈ ముసుగెందుకురా వేసుగున్నావ్, ఎఁ, ఎందుకురా ఈ ముసుగూ?

కు—ఒస్, ఇదాండీ! చల్లగానూ ఛలిగానూ ఉంది కాదండీ, అందుకూ! నాకు సెలవునాన్నగారు, మళ్ళీ వేళ దాటిపోతుంది. ఒకచోట నాకు ప్రత్యేకంగా వ్యక్తిపరమైన రాచకార్యం ఉంది.

ప—ఆగాగు. నువ్వు నాకోసం వెతుకుతున్నానన్నావే! పోనీ, బాబీ, ఎక్కడికిరా, ఈ వెళ్ళడం?

కు—వెళ్ళడమేనాండీ!

ప—మరేరా, వెళ్ళడం ఎక్కడికీఅని.

కు—నే వెళ్ళేది ఎక్కడికనా?

ప—మరేరా! మోటసన్యాసిలా తయారయినావేం!

కు—అదాండీ! నేను...(సకిలించి) నేనండి......
అసలు... మొదట...కల్పకందగ్గిరికి వెళ్ళి...ఆ పిల్లతో సొసా
యింపు చేసుగోవాలని... పన్లోపని మీరు కనిపిస్తారేమో...

ప—కలిసి వెళ్ళచ్చుననిగావును, ఇంకేం, రా,
పోదాం.

కు—అబ్బెబ్బే, అమ్మనాయనా, ఛస్తేరానండి, ఏమి
చ్చినాసరే! అనుకోడంమాత్రం అనుకున్నాను, మిమ్మల్ని
కలుసుగోవాలని. కాని, నాన్నగారూ, చాలా చలిగా
లేదూ! మీరు ఆరుబయట నుంచోకండి.

ప—ఛలీలేదు గిలీలేదు, పోదూ! అయితే బాబీ,
నువ్వు కల్పకంతో ఏమిచెబుదామనీ?

క—క్షమించండి నాన్నగారూ! ఎల్లానో ఆ పిల్లని
ప్రసన్నం అయేలాగు చెయ్యాలని, ఏ వాగ్దానాలో, ఏప్రమా
ణాలో, ఏవో చేసి...నాన్నగారూ, మీకు ఆలస్యం చేసేస్తు
న్నాను. మీ కీళ్ళనెప్పులకి ఈ చలి దోహదం అయిందాంటే,
చిక్కుగదా...

ప—ఆఁ ఏడిసిందిపోదూ, వెధవ-ఛలీ—వెధవఛలీ
కుంకఛలీసీ! నా కిప్పుడు మరోపని ఏమీలేదు. మీరు
యువకులురా, అసాధ్యులూ! మీకు ఎదేనా సంకల్పం
(అని, కుమారసేనం హృదయంకేసి వేలెట్టి సూచిస్తూ)
ఇక్కడ పుట్టిందీఅంటే...(కత్తి చేతికి తగలగా) ఓరి నీ
మొహం ఈడ్చా! ఏమిట్రా చొక్కాకింద దాచావ్రూ?

కు—అబ్బే! ఏముంటుంది, నాన్నా, ఏమీలేదండీ.

ప—లేకపోడమేమిటి, భడవావేషాలూ నువ్వూనూ! చేతికి గట్టిగా రాయల్లా తగిల్తేనే దాన్ని నరికెయ్యా!

కు—బస్! ఇదా! లోలకులండీ, లోలకులు—కల్ప కాన్ని కొంచెం తమాషా చెయ్యడానికి చిన్న బహుమతీ!

ప—అల్లానుట్రా, లోలకులా! ఏవీ ఓమాటు చూపించు, ఏమాత్రం నాజూకుగా చెయించావో చూద్దాం. (అని చొక్కా పట్టుగుని లాగగా, కత్తి కిందపడుతుంది.) లోలకులా! కల్పకానికి చిన్న బహుమతీకదూ! ఓరి నీ చేష్టలు మాసిపోనూ, కత్తుచ్చుగుని పీక తెగ్గోసుగోదల్చు గున్నావా యేమిరా, నీమొహం ఇద్దైపోనూ!

కు—హాహాహ (అని నవ్వి) లేదండీ నాన్నగారూ! మిమ్మల్ని కొంచెం వినోదపరచాలని ఊహించాను. అసలు సంగతి చివరికిగాని చెప్పదల్చుకోలేదు.

ప—చెప్పదల్చుకోలేదూ, అహోరించలేకపోయావు, వాజమ్మ, ఆ ఆ మహావినోదకరంగా ఉంది, ఈ లోలకుల వ్యాపారం.

కు—ఉండండి, నాన్నా, మీకు విశదంచేస్తానూ. కల్పకం ఉందాండీ, నాన్నా! కల్పకం ప్రణయం యావత్తూ ఊహాప్రణయమండీ. అందులోనూ అతీతమైన రకం, కొంచెం హెచ్చుతగ్గు పిచ్చిధోరణి అనచ్చు. అందుకండీ, నే నేమని ఆలోచించానా, ఒకవేళ కల్పకం నన్ను క్షమించ డానికి తిరస్కరిస్తే, ఈ ఖడ్గం ఒరలోంచిలాగి, నిలబెట్టి, దాని

మీదపడి, ఆమె పాదాలదగ్గిర నా ప్రాణాలు అర్పించదల్చు
కున్నానని ప్రమాణం చేద్దామని.

ప—కత్తిమీద కాదు, ఫిడేలు కమానుమీద పడతా
నను, పోరా, నువ్వూ నీ ప్రమాణమూనూ ! అల్లా పడడమే
కోరుకుంటుం దేమో ఆ పిల్ల !—అందుకని పడరా, పడూ,
పడి నిష్క్రమించరా, గాడిదీ !

కు—అబ్బ ! చూద్దురుగాని నేనెల్లా నెగ్గుతానో !
విందురుగాని నా విజయవార్త ! "హా, కల్పకం, నాకు
క్షమాభిక్ష పెట్టు, లేదా ఈ కత్తిధారే నాకు గతి" అం
టాను.

ప—"ఓహో, మూర్ఖశిఖామణీ, దయచెయ్యవోయ్,
శీఘ్రంగానూ" అని ఆమ్మాయంటుంది. పోరా, పాడులోల
కులూ నువ్వూనూ !

కు—(నవ్వుమొహంతో, తండ్రి సెలవు తీసుగుం
టూన్నట్టు చెయ్యి ఊపి, వందనం చేస్తూ, L F కి గబగబా
వెళ్ళిపోతాడు).

త—(R F నించి ఎంతో ఆయాసంతో పరిగెట్టుకుని
రోజుతూ వస్తూ) అయ్యో అయ్యో ! ఆయన్ని ఆపండి
ఆపండి ! ఖూనీ, చోరులు, అగ్ని. ఆయన్ని ఆపండి. అగ్ని
చల్లార్పండి. మిమ్మల్నేనండీ, పరాంకుశప్రభూ ! ఆయన్ని
వెనక్కి రమ్మనండి, వెనక్కి రమ్మనండి. ఆపండి ఖూనీలు,
ఆర్పండి అగ్ని.

ప—ఖూనీలా ? అగ్నా ? ఎక్కడో యేఁ, ఆ రెం డూనూ !

త—ఎక్కడా ! నా నెత్తిమీద. ఈ అబ్బాయి దృష్టికి అందకుండా పోయాడు. నామట్టుకి నాకు ఊపిరి అంద కుండా పోతోంది. పరాకుంశంగారూ ! ఈ అబ్బాయిని ఆప లేకపోయారుకదా ! ఎందుకు ఆపకలేక పోయారండీ, వెర్రి నాయనా !

ప—అరి వీణ్ణి నరికెయ్యా ! ఈ ముండావాడికి మతి పోయినట్టుంది.—ఎవణ్ణిరా ఆపవలిసిందీ ? మా బాబీనా ?

త—మరేనండి, ముసలయ్యగారు, కుమారసేనం గార్ని. ఆయన వెడుతూన్నచోట ఖూనీలూ హత్యలూ చెలరేగి పైకి లేచిపోతున్నాయి.

ప—ఖూనీలా ?

త—చిత్తం, పరాంకుశప్రభూ ! ఖూనీల్లో ఎన్నెన్ని రకా లుండగలవో అవన్నీనూ హత్యల్లో ఎన్నెన్ని విశేషా లుండగలవో అవన్నీనూ ఆ మైదాన ప్రాంతాల్లో ప్రత్య క్షంగా కనిపిస్తూ తెగ విహారం చేసేస్తున్నాయండి. మనం వెడితే ఈ పళంగా మనికీ దర్శనం ఇస్తాయి—కత్తియుద్ధం, తుపాకీ యుద్ధం, ఏక రక్తవరదలు...

ప—ఏడిశావులేస్తూ ! ఎక్కడో శుంఠలా ఉన్నావే! ఎవ రెవరు పోట్లాడేదీ ?

త—ఎవ రెవరాండీ ! నే నెరుగున్నవాళ్ళంతానండి, ప్రభూ ! ఉన్నమాట చెప్పకపోడం ఎందుకండీ—ప్రతీవాడూ

అడ్డమైనవాడూ అక్కడ యుద్ధం చెయ్యొదల్చుకున్నాడండి— నా వెర్రియజమాని దేవయ్యగారూ, జ్వాలారంగప్రభున్నూ మీా కుమాళ్ళు కుమారసేనంగారూ......

ప—ఓరి బాబీగాడిదీ! ఇవా వీడి వేషాలుగా! ఒరీ, నీకు ఆ స్థలం తెలుసురా?

త—రాజుగారి మైదానమండి.

ప—అక్కడికి దారి నీకు తెలుసా?

త—ఇక్కడికి అది ఏవేపోకుడా తెలియదండి. అయినా నేను దండనాధికార్నీ ఉద్యోగుల్నీ రక్షక భటుల్నీ అర్చకుల్నీ మతాధికారినీ అందర్నీ పిలుస్తానండి. వాళ్ళని విడదియ్యడానికి ఎంతజనం వెళ్ళినా ఎక్కువ వెళ్ళారనే మాటుండదు.

ప—అయితే నడు. ఇల్లా రా. కాస్త అనుకోనీ. నడుస్తూ ఇతరుల్నికుడా కేకేద్దాం. మూా బాబీ వొత్తి పుండ్రా కోరే, అన్నీ అబద్ధాలే. సరి సరి. నా కప్పుడే వెర్రికోపం రేగుతోంది. హారి వీడిల్లు వల్లకాడుగానూ, ఇదా లోలకుల చరిత్రా! మంచి బహుమతీ ఇచ్చి వీడి లోలకుల్ని లాలిస్తా, నడు.

(అని, మోకాళ్ళు పట్టట్టినట్టు నటిస్తూ, తలుపులు ఆసరా పుచ్చుగుని వీలైనంత తొందరగా L F కి వెళ్ళి పోతాడు). (తెర).



## రంగం-7

[రాజుగారి మైదానం. RM నించి, ఇద్దరూ చెరొక పిస్తోలూ పుచ్చుగుని ముందు జ్వాలారంగమూ అతడి వెనకాల దేవయ్యా వస్తారు]

దే—నా శౌర్యదేవత సాక్షి, జ్వాలారంగప్రభూ! నలభై గజాల ఎడం ఉచితమైన దూరం. దిక్కుమాలి మట్టాలూ లెక్ఖ్యాలూ అంటూ బోలె డుంటాయిగా! అందు కని నలభై గజాల ఎడం ఉచితం.

జ్వా—నలభై గజాల ఎడం బారుతుపాకీల ద్వంద్వ యుద్ధానికా, పిస్తోలు యుద్ధానికా? నా ప్రమాణపూర్తిగా చెబుతున్నాను, దేవయ్యగారూ! ఇల్లాంటి విషయాలు మీరు నాకు వదిలిపెట్టెయ్యాలి. ఉండండి, చూపిస్తాను. (ఒక చోటు చూపించి, అక్కణ్ణించి రెండు అడుగులువేసి) ఇదుగో, ఈ ఎడం చాలు, ఈ దూరం దివ్యంగా బహు ఇదిగా ఉంటుంది. ఇది గొప్పతనహోవాళ్ళకి నికరంగా సరి పోయే దూరం.

దే—సరి సరి. ఇంత దగ్గరైతే ఎల్లా? ఇంకా నయమే, ఓ కావిడిపెట్టెలాంటి దాంట్లోదూరి కొట్టుకో మన్నారు కాదు. చెబుతా వినండి, జ్వాలారంగప్రభూ! అవతలవాడు నా నించి ఎంత దూరాన్ని ఉంటే అంత గుండె నిబ్బరంతో నేను గురిచూసుగుంటాను.

జ్వా—చాలా దూరాన్ని ఉంటే?

దే—చాలా నిబ్బరంగా గురిచూస్తాను.

జ్వా—ఏడిసి మొహంకడుక్కున్నట్టుంది. అవతల వాడు అసలు కనపడనేకుండా ఉంటే, బహు మిక్కిలి నిబ్బరంగా గురిచూసుకుంటూ నంటూవుగావును !

దే—అబ్బెబ్బే ! మరీ బొత్తిగా కనపడకుండా ఉండ కూడదండీ ! నా ఉద్దేశంలో, ఓ నలభై గజాలు !

జ్వా—టుట్, నలభై గజాలేమిటయ్యా !

దే—పోనీ, అన్నిలేకపోయినా, ముప్పై ఎనిమిదీ ముప్పై తొమ్మిదీ ఆప్రాంతాన్ని ఉండచ్చు !

జ్వా—ఛీ ఛీ. బుద్ధితక్కువగా మాట్లాడకండి మరీ. మీ పిస్తోళ్ళ చివళ్ళకి మధ్య మూడు నాలుగు అడుగులు ఉండడంకుడా ఎక్కువే—ఆ దూరమే మైలన్నమాట.

దే—అయ్యో ప్రాలుద్ధం పిస్తోళ్ళూ ! నా శౌర్యం కాలా ! అంత దగ్గిర ప్రాంతంలోంచి శత్రువుని చంపడంలో విశేషం ఏముందయ్యా ! జ్వాలారంగంగారూ, ప్రియ మిత్రమా, దూరప్రయోగంతో ఎదిరివాణ్ణి మట్టంచెయ్యాలి. అల్లా చెయ్యనిస్తురూ, మీకు చాలా పుణ్యం ఉంటుందీ !

జ్వా—సరే సరే. నీ పోటీదారుతో ఇంకోడు వస్తాడేం, వాడూ నేనూ ఆ సంగతి స్థిరపరుస్తాం. అది సరికాని, దేవయ్యగారూ, కీడెంచి మేలెంచాలి, ఒకవేళ దైవాద్వా మీకు ఏదేనా ప్రమాదం సంభవించవచ్చునగనక, మీ ఆలోచనలో ఎదేనా విల్లు వ్రాయింపించడం అంటే ఎదేనా కోరిక చెల్లింపించడం అంటే లాంటి గొడవ లున్నాయా ?

దే—మీరు చేస్తూన్న సాయానికి నేను ఋణం తీర్చలేనుగాని, జ్వాలారంగంగారూ, ఏంమాటలండీ అవీ, నాకేమీ బోధపడటంలేదు.

జ్వా—బోధపడడానికి ఏముందీ ? అవతలవాడి చేతు లోకుడా పిస్తోలు ఉన్నప్పుడు మన సంగతి ఏమవుతుందో ఎవడు చెప్పగలడూ ? మనకి దురదృష్ట కారకమైన ఒక్కొక్క పిస్తోలురవ్వ మనకి అమాంతంగా స్వస్తిచెప్పేసే రకం కావచ్చు. నా అభిప్రాయంలో, అటువంటి సమయం, మీ కుటుంబ వ్యాపారాల సోదెతో మిమ్మల్ని ఆందోళన పెట్టే కాలం కాకూడదు.

దే—మనకి స్వస్తే ?

జ్వా—అనుకుందాం, ప్రస్తుతం. అల్లా గనక జరిగితే, మిమ్మల్ని లేవదీసి ఇంటికి రవాణా చెయ్యమని సెలవా ? లేక, ఈ పక్కనే ఉన్న సమాధిలోనే పక్క వెయించినా తగాదా లేదని మీ అభిప్రాయమా ? ఈ సమాధైనా వెచ్చగానూ పడక్కి చాలా ఇమ్ముగానూ ఉంటుందని విన్నాన్లెండి.

దే—ఆఁ ఆఁ—లేవదీసి ఇంటికి రవాణా ? సమాధి వెచ్చగానూ పడక్కి ఇమ్ముగానూ ? అయ్యో వణుకా ! జ్వాలారంగంగారూ, ఆ ధోరణి మానండి.

జ్వా—దేవయ్యగారూ, పాపం ఈ రకం వ్యవ హారంలో మీ రెప్పుడూ పాల్గొనడం జరగలేదుగావును.

దే—లేదు, స్వామీ, ఎన్నడూ లేదు.

జ్వా—అల్లా చెప్పండిమరీ, అదే వచ్చినకర్మం ! ఏ పనికైనా అలవాటు పడిపోడంలాంటిది బుర్రపోతే మరోటి లేదు. సరే, చూపించండి. అతడు పిస్తోలు పేలిస్తే, గుండు

మీ కేసి రివ్వుమని వచ్చేటప్పుడు మీరు దాన్ని ఎల్లా స్వీకరించదల్చారూ ?

దే—అదా, తెలిసొచ్చింది పోదురూ ! అల్లాంటివి బోలెడు అభ్యాసం చేశాను. ఇదుగో చూడండి. ఇల్లా నుంచుంటాను. (అని ఠీవిగా ఒక శరీరస్థితి చూపిస్తాడు.) పక్కకి తిరుగుతాను, ఏదో తమాషాచేసి సూక్ష్మశరీరం తాలుస్తాను, ఎల్లానో సన్నగిల్లిపోతాను.

జ్యా—సరే. అల్లా నుంచుంటే దయచేశారన్న మాటే. నేను గురిచూస్తాను నుంచోండి. (అని, తనపిస్తోలు బారుచేసి, గురి చూస్తాడు.)

దే—చచ్చాన్రా దేవుడా ! ఏమండోయ్, బాబూ, అందులో మందూగట్రా దట్టించిలేదుకదా !

జ్యా—అబ్బే, దీనికి భయం ఎందుకండీ !

దే—భయం ఎందుకంటే, మీ కేం తెలుసూ ! కొన్ని కొన్ని పాటంతట అవే పేలేరకం ఉన్నాయి, వాటి మొహాం మండా !

జ్యా—అబ్బెబ్బే, స్థిమితపడండి. ఏమంటారా, మీ శరీరంలో ప్రవేశించడం అంటూావస్తే, నా పిస్తోలురవ్వలకి రెండు తరుణాలున్నాయి. మొదటిదెబ్బ మీ కుడిపార్శ్వం లోని సజీవభాగాన్ని దూసుకుపోతే రెండోదికూడా ఎడమ పార్శ్వాన్ని తుడిచెయ్యకపోతే, అప్పుడుగదా చిక్కు !

దే—సజీవభాగాన్ని తుడిచేస్తుందా !

జ్యా—ఏమైతేం, అల్లానుంచోండి చెబుతాను. (అని, అతణ్ణి ఒకచోట నిలిపి) ఇల్లా అడ్డంగా దడి కట్టినట్టు నుంచోండి. ఈ స్థితిలో మీ శరీరంలోంచి ఖాటంగా ఒకటి

రెండు గుళ్ళు ఇవతలనించి అవతలకి పోవచ్చు, అయినాసరే మీకు కించిత్తూ అపాయం కలక్కపోవచ్చు.

దే—నా శరీరంలోంచి ఇవతలనించి అవతలికా! ఒకటి రెండుగుళ్ళు! ఇవతలనించి అవతలకి!

జ్వా—మరే, లెక్ఖేమిటీ, అవ్యాహతంగా పోవచ్చు. పైపెచ్చు మరో విశేషంకూడాఉంది. గొప్ప తరహావాడికి అర్హమైన శరీరస్థితియొక్కవాటం ఇదే.

దే—ఏమయ్యోయ్, జ్వాలారంగంగారూ, నేను గుండుదెబ్బ తినడానికి గొప్ప తరహావాడికిమల్లే అక్ఖర్లేదు, అవకరపు శరీరస్థితిలోనే తింటానులెండి. ఇల్లా పక్కకితిరిగి నుంచుంటాను.

జ్వా—(గడియారం చూసి) మనకి వాళ్ళు ఆశాభంగం కలిగించరని అనుకుంటాను. ఉండండి. లేదు. అహా, వస్తున్నట్టున్నారు. (అని L F కి చూస్తాడు.)

దే—ఏమిటి? వాళ్ళే? రావడమే? (అని కళ్ళు కప్పెట్టుగుంటాడు.)

జ్వా—(పరకాయించి L F కేసి చూసి) ఆ. అదుగో. ఆ గొప్పమీదనించి వస్తున్నారు.

దే—వచ్చేది ఇద్దరావేమిటి? వస్తేమాత్రం భయమా? రాసీండి కుంకల్ని. జ్వాలారంగంగారూ! మనం... మనం...మనం...ఛస్తే......పారిపోం. కాట్టండీ? ఛస్తే పారిపోం.

జ్వా—పారిపోవడమూ? ఛీ.

దే—రెండుమాట్లు—ఛీ. చచ్చినా పారిపోం, అని, నే నంటూంటా! నా శౌర్యం నువ్వెపోనూ, పారిపోతాం టండీ?

జ్వా—మీా రెట్లానో అయిపోతువ్నా రేం?

దే—ఏమీా లేదండీ. ఎంతమాత్రమూ ఏమీాలేదండి. కాని, ప్రియమిత్రమా, నా ప్రియ జ్వాలారంగంగారూ! (వణుకుతూ) నేను...నేను...నేను...ఎంచేతో కాని, వెనక టంత...ధైర్యంగా, లేను, లేను.

జ్వా—చి ఛీ. ఏమిటయ్యా అల్లా అంటావ్! నీ గౌరవం పోతుంది, ఆలోచించుగో.

దే—మరేనయ్యోయ్, నిజమే, నా గౌరవంఅనేది ఒకటుందిగా! 'జ్వాలారంగంగారోవ్, నా గౌరవ ద్రవ్యం సంగతి అడపా దడపా నా చెవులో పోస్తూండండి.

జ్వా—తీరిపోయింది. అదుగో వాళ్ళు (అని L F కి చూస్తాడు).

దే—జ్వాలారంగంగారూ! మీా సాన్నిధ్యాన్ని ఉండ బట్టికాని, లేకపోతే నాకు తారెత్తిపోయిందా అని నేనే అనుకోవలిసొచ్చి ఉండేది. కాని, ముందే అడిగి అట్టేపెడితే మంచిదీ, ఒకవేళ నా శౌర్యం నాలోంచి ఉడాయించేస్తుందే అనుకుందాం, దీన్ని తగలెయ్యా—ఈ శౌర్యానికి ఇదో రోగ మాయిరి, వస్తూంటుంది పోతూంటుంది—అప్పుడు ఎంజెయ్యా మని తమ సలహా!

జ్వా—ఒకపని చెయ్యండి. వస్తూ పోతూంటుంది గనక, వచ్చే సమయం కనిపెట్టి అమాంతంగా దానిమీాద పడి పట్టుగుని బంధించి, ఫురి పోనియ్యకండి.

దే—జ్వా-లా-రం-గం-గా-రూ ! నాకు చాలా సందేహంగా ఉంది. నా శౌర్యం ఇదుగో ఇదుగో పోతోంది పోతోంది, ఒట్టు. చూడండి. నిశ్చయంగా, పప్పులా జారి పోతోంది, నక్కి నక్కి తోక ముడుస్తోంది. నా వంట్లోంచి, చేతుల్లోంచి, వేళ్ళల్లోంచి, గోళ్ళల్లోకి పాకేసి అదృశ్యం... అయింది.

జ్వా—నీ శౌర్యంమాట సరి. నీ గౌరవంమాట జ్ఞాపకం ఉంచుగో—నీ గౌరవం. ఇదుగో వాళ్ళు.

దే—హా దైవమా ! నా యింట్లో నేను కడుపులో చల్ల కదలకుండా ఉండకూడదూ! పోనీ, నాకు తెలియకుండా శత్రువు నన్ను పేల్చెయ్యకూడదూ !

[L F నించి కృపాకరం, కుమారసేనం, వస్తారు]

జ్వా—మహనీయులారా ! సుసాయంత్రం ! విధేయుణ్ణి. ఓహోహో ! ఇదెవరూ, కుమారసేనానా ? అల్లానాండీ ? నా మోస్తరుగానే మీరూ వచ్చినట్టున్నారు, అవసరం అయితే స్నేహితుడికి మొదట ఉపచారం చెయ్యడానికిన్నీ, తరవాత స్వంతవిషయంలో పని చూసుగోడానికిన్నీ !

దే—ఏమోయ్ బాబీ ప్రియమిత్రమా !

కు—చిన్నీ! నీ శత్రువు, వసంతం ఇక్కడే ఉన్నాడు.

జ్వా—అయితే సరే. • దేవయ్యగారూ ! వీ రిద్దరికీ మామూలు లాంఛనప్రకారం మీరు వందనం చెయ్యడంలో ప్రత్యవాయం ఏమీ లేదనుకుంటాను. (కృపాకరమే వసంతం అనుకుని) రండి, మీ ఆయుధాలు ఏవేవో మీరు నిర్ణ

యించుగోండి, స్థలం నేనూ సేనానిగారూ కొలిచి స్థిర పరుస్తాం.

కృ—నా ఆయుధా లేమిటి, స్వామీ !

దే—సరి సరి, నా జన్మకాలా ఇదోటా ? జ్వాలా రంగ మహాశయా ! ఇతడు కృపాకరం. ఇతడితో నేను యుగం తిరిగినా దెబ్బలాడను. వీళ్ళిద్దరూ నాకు ముఖ్యాతి ముఖ్య స్నేహితులు.

జ్వా—(కృపాకరంతో) ఏమండీ, మహాశయా! తమ రిక్కడికి వస్తా దేవయ్యగారితో ద్వంద్వయుద్ధానికి కాదూ ?

కృ—ఛస్తే కాదు, ప్రమాణికంగా కాదు.

జ్వా—అల్లాయితే, ఇది చాలా చాలా కోపకారణం. ఈ ద్వంద్వసమరాల విషయంలో ముగ్గురు దిగ్గజాలు సిద్ధమై ఉంటూండగా మీ రొక్కరూ దౌష్ట్యం వహించి, నన్ను ముట్టుగోకు అన్నట్టు ముభావంగా కూర్చోడానికి నీచంగా తెగిస్తారని నేననుకోను.

కు—నువ్వు పోట్లాడు, కృపాకరం. లేకపోతే జ్వాలా రంగంగారు ఇదవుతారు.

కృ—అది కాదు. ఒక వేళ దేవయ్య పట్టడితే పోట్లా డాలి...

దే—అబ్బెబ్బే! లేదు, కృపాకరం, నాకు పట్టుదల ఎంతమాత్రమూ లేదు. ఆశాభంగం జరిగినా, దాన్ని నేను యథార్థమైన సాత్త్వికబుద్ధితో భరిస్తాను. ఏమండోయ్, జ్వాలారంగంగారు, చూడండీ, నేను పోట్లాడడానికి నెపం పిసరంతైనా కనపడటం లేదు నాకు. మీకూ కనిపించదని

నా ఊహ. నే పోట్లాడ్డం అనేది ఇంతటితో ఆపేస్తే శ్రేయస్కరం.

జ్వా—ఏమయ్యోయ్, దేవయ్యా! నీ తృణీకరణం మహా జోరుగాఉందే! నువ్వు ఎవణ్ణో సవాలుచేశావ్వా, సవాల్ చేసి వాణ్ణి ఢీకోడానికి వచ్చేశావ్వా, ఈ మహాశయుడు వాడితరఫున వచ్చాడూ, నిక్షేపంలాగ జరగడానికి వీలున్న పోట్లాట నువ్విప్పుడు ఏ మొహంపెట్టుగుని మానేస్తున్నావ్ ?

దే—నా మొహంలానేఉంది మీరనేమాట. వినండి. నేను వసంతం అనే దళవాయిగాణ్ణి సవాల్ చేసినమాట వాస్తవం. ఎంచేతో ఆ కుంక మొహంచాటేసి దాక్కున్నాడు. వాడేగనక ఇక్కడ కనిపించాడా, చూస్కోండి మీ కళ్ళముందు వాడి భవిష్యం ఊడదీసి పారేస్తానోలేదో, వాడి హక్కులన్నీ కక్కిస్తానోలేదో!

కు—ఉండు చిన్నీ ఆగు. నీకు ఒక యధార్థం చెప్పనీ. వసంతం అనేవాడు భూమ్మీద ఎక్కడాలేడు. ఆ పేరుతో వ్యవహరించినవాడు, ఇప్పుడు నీతో మాట్లాడుతూఉన్నాడు. ఆ వసంతం హక్కులూ ఈ మాట్లాడుతూన్న వాడి హక్కులూ అన్నివిధాలా అభిన్నమే గనక, నీ చిత్తంవచ్చిన రీతిగా నీతో పోట్లాడి, వీడు ఆ హక్కులు నిలబెట్టుగుంటాడు.

జ్వా—ఇంకేం, అయితే అదృష్టం పుచ్చిందన్నమాటే! దేవయ్యగారూ, మీకిది మంచితరుణమే.

దే—ఏడిసినట్టేఉంది. పోట్లాడి పోట్లాడి నా హృదయమిత్రుడైన కుమారసేనానితోనా నేను పోట్లాడడం! ఛీఛీ! ఇతడు యాభైమంది వసంతంగాళ్ళని గుండకొట్టగా తయా

రైన విగ్రహం అయినాసరే, నేను ఇతనితో పోట్లాడను. మీ పోట్లాటలు మాసిపోనూ! జ్వాలారంగంగారూ! ఇంత అసహజమైన ద్వంద్వయుద్ధం నేను చెయ్యాలి అని మీరు నట్టుకు ఏ మొహంతో అనగలరూ?

జ్వా—ఎమోగాని, దేవయ్యగారూ, మీమీద పగ తీర్చుగోడానికా అన్నట్టు మీ శౌర్యం మీలోంచి సమూలంగా లేచిపోయింది, అనాలి.

దే—లేదయ్యా, లేదు. హంగుదార్లకీ సహాయులకీ మాత్రం శౌర్యం ఉండక్కర్లేదుమరి! నీ ద్వంద్వయుద్ధంలో నీకు నేను సహాయుణ్ణిగా ఉంటాను, హృదయపూర్వకంగా! నీ జగడంలో నీపని స్వస్తి అయిపోతుందనుకో, అప్పుడు నీ యిష్టంవచ్చిన పని చెయ్యవలిసిందిగా నాతో చెప్పు, అలా నేను చెయ్యకపోతే మొహంమీద చెప్పు! నీ ఆజ్ఞ ప్రకారం ఈ పక్క శ్మశానంలో మంచి పక్కమీద నిన్ను గుమ్మగా పడుకోపెట్టించడం పూచీ నాదీ. ఆ రీతిగా కాక నీ కోరిక తైలద్రవంలో ఊరగాయి పడాలనో లేక ప్రదర్శనాలయంలో నిల్చిఉండాలనో ఉంటే, మిక్కిలి సంతోషపూర్వకంగా అలా అక్షరాలా జరిపించేస్తాను.

జ్వా—ఛీ ఛీ నోరుముయ్, పిరికిపందా!

దే—చూశారండీ, నేను పిరికివాణ్ణిట. ఇల్లానేనా నన్ను అనవలిసిందీ!

జ్వా—ఇప్పుడు మళ్ళీ అంటాను, పోహెయ్.

దే—పోన్లేస్తురూ, కొందరు తమాషాకోసం అల్లా అంటూంటారు. ఆమాట నేను లెఖ్ఖచెయ్యను. కాని,

నన్ను మీరు 'దిక్కుమాలీ చవటసుంక' అంటారా, మరి చూస్కోండి గ్రంథం—కత్తులు కటార్లు గుళ్ళు రవ్వలు—ఘాం ఘూం!

జ్వా—బస్ బస్. ఏడిశావుపోవయ్యా దేవయ్యా!

దే—అరె! బొత్తిగా అల్లా తిట్టేస్తావేమిటే, కుటుంబ మర్యాదకుడా లేని ఘటానివిలాగ!

జ్వా—ఛ, పో, నువ్వు నాకు బలాదూరూ!

కు—ఆగండి, జ్వాలారంగంగారు! నా స్నేహితుడైన ఈ దేవయ్యకంటె ఘట్టిసహాయుడు మరొకడు గాలించినా మీకు దొరకడు. ఇతడు పసిపడితే వదలని వేటకుక్క. ఇతడికి పోట్లాట చిన్నీ అని బిరుదు. ఈ శూరుడు వారానికి ఓమనిషిని వతనగా చంపేస్తూంటాడు. కాదుటోయ్, చిన్నీ!

దే—అవును, మా యింటి చుట్టుపట్ల.

జ్వా—సరే, సేనానీ, అల్లాయితే ప్రారంభించుదాం. (అని, కత్తి ఒరలోంచి పైకిదూస్తూ, కత్తితో) బయటికి వేంచేయువయ్యా ఖడ్గరాజా, చిట్టిమంత్రీ! వేంచేసి ఈ వైరి ఆ యువతిని మన కర్పిస్తాడో లేక తనమీదికి దాడి వెడల వలిసిన నిర్బంధం నీకు కలిగిస్తాడో భోగట్టాచెయ్యి!

కు—బస్, అల్లాయితే కాస్కోవయ్యా! (అని కత్తి దూసి) మీ రీ వ్యాపారం ఎల్లానూ సౌమ్యంగా కుదర నిచ్చేటట్టు లేరు గనక, ఇదే నా సమాధానం.

[L F నించి పరాంకుశమూ, తలుపులూ,
రాంభాణమ్మా, కల్పకమూ వస్తారు]

త—రండి, పరాంకుశప్రభూ ! మీ సుప్రసన్నత ప్రకటించి, వీళ్ళని ఒక్కసారి చితక్కొట్టండి, దయచేసి. మీరు మొట్ట మొదట్లో మా యజమానిగారిని ప్రత్యేకంగా దిమ్మతిరగెయ్యాలని నా మనవి. ఈయన చేతులకి సరిపడ సంకెళ్ళు వేస్తేగాని వాటి ప్రవర్తన బాగుపడదు.

ప—(కుమారసేనాన్ని చూసి) ఛాబీ ! టట్ ! దాచెయ్ కత్తి, ఒరలో ఉంచెయ్, మొదట! లేకపోతే నేను బలే పిచ్చిలో పడిపోతాను. ఊఁ. ఎల్లా వచ్చిందోయ్ అసలు ఈ ద్వంద్వయుద్ధం?

కు—నాకంటె ఆయనకే బాగా తెలుసునండి. ఆయనే కయ్యానికి కాల్దాచి నన్నిందులోకి లాగేశాడు. నేను రాజసేవకుణ్ణిగదా !

ప—ఓరి నీ తెలివి తెల్లారా, చవటయ్యా ! రాజసేవే నీకు ప్రధానమైనపక్షంలో నీ రాజాయుధం రాజపాలితుల్లో ఒకరిమీద ఎందుకు దూశావురా ?

కు—అయ్యా ! ఆ మహాశయుడు తనే నన్నీజగడంలోకి ఈడ్చాడు, తన సబబు లేముటో ఎంతమాత్రమూ విశదం చెయ్యలేదు.

ప—ఏమయ్యా, నా కుమారుణ్ణి ఈ జగడంలోకి ఎందుకీడ్చావయ్యా నీ సబబు లేముటో ఎంతమాత్రమూ విశదం చెయ్యకుండానూ ?

జ్యా—మీ కుమారుడండీ, నేను సగౌరవంగా పడి ఊరుకోడానికి వీల్లేనంత కోపం నాకు తెప్పించాడండి.

ప—హారి పింజారీ! బాబీ! ఈ మహాశయుడు తను సగౌరవంగా పడి ఊరుకోడానికి వీల్లేనంత కోపం ఈయనకి తెప్పించడానికి నీకు గుండె లెల్లా వచ్చాయిరా?

రాం—అయ్యా, ఆగండి. ఇక్కడ స్త్రీలం ఉన్నాం. గౌరవం సంగతి మరవద్దు. కుమారసేనానీ, మాట! మమ్మల్ని ఇల్లా హడలగొట్టేస్తున్నావే! ఈ కల్పకంకేసి చూడు. ఇది భయంతో బొత్తిగా కొయ్యబారిపోతోంది.

కు—ఆ అమ్మాయి భయం ఎందుకోసమండీ, నేను చచ్చిపోతాననా, గెల్చిపోతాననా?

రాం—వద్దు వద్దు. గతించిపోయిన పరమేయాల గురించి ఏమీ ఎత్తవద్దు. కల్పకానికి మనస్సు నచ్చి దృఢ పడింది. చెప్పమ్మా, అమ్మాయి!

జ్యా—ఏమమ్మోయ్, ముసలమ్మగారూ! తమరు సెలవిస్తే, నేను ఒకమాట ఆడవలిసి ఉంటుంది, ఈ సందర్భంలో. ఆ అమ్మాయియొక్క మౌనానికి అర్థం నేను చెప్పగలనని నా నమ్మకం. ఎంచేత అనగా......

క—ఏమిటండీ, తమరు చెప్పబోయేదీ?

జ్యా—ఓ హంసాదేవీ! నీకు తెలియకపోవడంఏమిటీ? ఈపాటి మనం త్రికరణశుద్ధి వహించాలి. ప్రస్తుతక్షణాల్ని చౌక చెయ్యకూడదు.

క—అయ్యా, తమరి మందలింపు విన్నతరవాత, వీరికి నా చెయ్యి అర్పించి, అందుకు ప్రతిఫలంగా వీరి హృదయం కోరుకోవాలని అనిపిస్తోంది.

కు—ఓహో! ఈ యువతి మానవి కాదు, అప్సరస; ఇవి మాటలు కావు, వరాలు; ఇది భావం కాదు, దివ్యగానం! జ్వాలారంగంగారూ, ఈ విషయంలో ఏదో తిరకాసు ఉంది. నేను మీకు చేసిన అపచారం ఏమీలేదు, ఉన్నా బుద్ధిపూర్వకం కాదు. అయినా నాకు తెలియని హెచ్చుతగ్గు ఏదేనా తమయెడల నావల్ల జరిగిఉంటే, అది తొలగచెయ్యడం ఎంతమాత్రమూ లజ్జాకరం అని నేను అనుకోనుగనక, మీ క్షమాపణ వేడుకుంటున్నాను. కాని, ఈ యువతి విషయంలో ఈవిడ హృదయాంగీకారం పొందిన నేను, నా హక్కు నిలబెట్టుగునే నిమిత్తం, ఎవడితోనైనా సరే పోరాడతాను.

ప—మా బాగా అన్నావు, బాబీ! నేను నీ పక్షం ఉంటాన్రా భడవా!

దే—ఏమంటావోయ్, ముందు చెప్పేస్తే ఉత్తరోత్రా ఎందుకేనా నయం—నేను నా హక్కు పూర్ణంగా వదులుకుంటున్నానండి. మరోటీ. ప్రపంచంలో దేనియందు నా కుండగల హక్కూకుడా ఇదుగో ఫీదాగా విసర్జించేశాను. పైగా, ఒక చిన్న సంగ్రామం జరిగితేగాని భార్య అనేది లభించని పక్షంలో, నా శౌర్యంమీద ఒట్టు—నేను చీమంతైనా పెళ్లాడకుండా ఎంతో బ్రహ్మచారిగా నిల్చిపోతాను.

జ్వా—నేనాసీ, ఎదీ చెయ్యి! (అని, చెయ్యి సఖ్యం సూచించడానికి ఊగించి) అపచారం చేసినవాడు తన అప చారం మార్దవంగా ఒప్పేసుకున్నప్పుడు, బాధితుడు విధే యుడై పోతాడు.—ఇక, ఈ యువతిగురించి. (కొన్ని ఉత్త రాలు పైకితీసి) ఈ ఉత్తరాల్లో ఉన్న దస్తూరీ ఈవిడ తన దస్తూరీ కాదనగలదేమో చెప్పమనండి.

రాం—ఓహోహో! ఇప్పుడు నాగుట్టు బట్టబయ లవుతుంది. జ్వాలారంగప్రభూ! బహుశః ఎక్కడో కొంచెం పొరపాటు జరిగింది. ఆ వయినం కొంత నేను చెప్పగలను.

జ్వా—ఏమమ్మోయ్, ముసిలిబామ్మా! నీ ప్రమే యం ఎంతమాత్రమూ లేని గొడవల్లో నువ్వు పూసుగుని వస్తూండకు. ఓ మిస్ కల్పకం! నువ్వు నా ప్రియ హంసా దేవివి అవునా కాదా?

క—అబ్బెబ్బే, ఎంతమాత్రం కాదు, జ్వాలారంగం గారు..(అని, కుమారసేనం దగ్గిరికి వెళ్ళగా, అక్కణ్ణించి అతడు R F సమీపానికి నడుస్తాడు. వెనకాలే, కల్పకం, అతని అడుగుజాడల్లో వెళ్ళి అతని ఎడమపక్క నిలబడు తుంది.)

రాం—జ్వాలారంగప్రభూ! నువ్వెంత కృతఘ్ను డవోగదా! నువ్వు ఎంత తప్పుపట్టినాసరేకాని, చెప్పడం నాకు ఒక్షరవ్వ సిగ్గుగానేఉంది కాని, క్షమించు, హంసా దేవిని, నేను,

జ్వా—నువ్వా హంసాదేవివి, హంసాదేవివి నువ్వా? ఛీ పో ముసిలివరుగూ! ఎవడేనా నవ్వగలడూ!

రాం—ఓయి మూర్ఖ పటాటోపీ! తమాయించు. ఆ ఉత్తరాలు రాసింది నేనే. వాటిల్లో ప్రతిలభించే దయ నువ్వు నిదానంగా హారాయించుగున్నావా, ఇంకా కొంచెం ప్రోత్సాహం వర్థించమని నువ్వే పంపిస్తావు నాకు మరో. దరకాస్తువిన్నపం!

జ్వా—అల్లానా! అయితే, రాంభాణమ్మా! నీ నమ్రత నాకు చాలా గుష్టుసివచ్చింది. ఈ ఎత్తు నీదైతేం ఉళక్కిడైతేనేమిగాని, నీకు దణ్ణం. చాలా చాలా దణ్ణాలు. ఇక, నేను కృతఘ్నుణ్ణి కానని దాఖలా చూపాలి గనక, కుమారసేనానీ, నువ్వు ఆ యువతిని నాదగ్గిర్నించి ఎల్లానూ తీసేసుగున్నావుగనక, ఆ యువతిని అసలనుకుని, ఆ అసలుకి ఈ వృద్ధనుకుని, ఈ హంసయానని కుడా స్వీకరించు. ఈ బేలామణిని నీకు సాలంకృత కన్యాదానం చేస్తున్నాను, మహారాజా అంగీకరించు. నీకాళ్ళు కడుగుతాను.

కు—జ్వాలారంగంగారూ, తమ దానానికి నేనెంతో ఋణపడిఉంటాను. అది సరేకాని, ఇక్కడ మన జగడాలు జెట్టీ,—చిన్నీ ఉండిపోతాడే, జోడు లేకుండా!

జ్వా—అవునవును. ఏమయ్యోయ్, శౌర్యకవచా, మేరుధీరా! తరుణం దాటపెట్టుగోకు. ఒప్పుగో. ఒక్ఖదెబ్బని నీ అదృష్టం పండిపోతుంది.

దే—(దణ్ణంపెడుతూ) బాబ్బాబు, నన్నిల్లా బతగ నీండి, ఈ కన్యేకాదు నాకు ఏ కన్యావద్దు. నన్ను క్షమించి, నా మానాన్ని నన్నిలా ఇంటికి వెళ్ళనియ్యండి.

కు—పోనీ కృపాకరం! నువ్వు మా రత్నమాల మీాద మాచెడ్డ కన్నూబుస్సూమంటున్నావు. ఈ కన్యా మణిని నువ్వు చేపట్టరాదూ?

కృ—మహాప్రభో! ఈవిడబారినించి నన్ను తప్పించండి. నేను ఏపాపమూఎరగను.

కు—కాదోయ్, నీకు రత్నమాలమీాద అనుమానం గదా!

కృ—నా మనోవ్యధకి మూలం నా గాఢానురాగమే! రత్నమాల నాకు ఏకైకలక్ష్యం. ఏంరా తలుపులూ!

ఈ—అవునండి. రత్నమాలగారే వీరికి పరమావధి.

ప—బాబీ, కల్పకం! మీా వివాహాపు ఏర్పాట్లు చేద్దాం. కృపాకరం, నీకు మా రత్నమాలతో వివాహం ఏర్పాట్లుకూడా చెయించేస్తాను.

(అనగానే, వాళ్ళు తలలువంచి నమస్కరించి R F కి నిష్క్రమిస్తారు. అప్పుడే L M నించి ఈలవేసుగుంటూ ఆకాశమూ అతడి చొక్కాఅంచు పట్టుగుని ఉళక్కీ, ఉన్నవాళ్ళ వెనకాల్నించి నడిచివెళ్ళి R F కి పోతారు.)

—అయ్యా! అందరూ ఆశీర్వదించి వివాహాలు జరిపించాలి.

(అనగానే, తక్కినవాళ్ళంతా ఒక్కొక్కరే LM కి నిష్క్రమిస్తారు.)

—రాంభాణమ్మగారూ, వెళ్ళొస్తాను.

రాం—చిత్తం. మీ అబ్బాయికీ మా అమ్మాయికీ ఉంటూన్న ప్రళయం ఇప్పటికి సారధికం అయింది.

ప—మరేమరే. అల్లా సర్దుకోడమేగదా మనం కోరేదీ! మరోసంగతి. ఈ జ్వాలారంగంగారూ, ఈ దేవయ్యగారూకుడా మిమ్మల్ని తిరస్కరించేశారుగదా అని మీరు కేవలం నిస్పృహాలో పడిపోకండిస్మీ. మీ కేమండీ, హాయిగా, ముద్దొస్తూ, ఇప్పటికీ, మిసమిసలాడిపోతున్నారూ! ఇంతా అంతా ఆకర్షణీయం అని చెప్పడానికి వీల్లేదు మీతో ప్రణయం! (అని నవ్వుతూ, వీలైనంత వడిగా, కాళ్ళ కీళ్ళపట్లనెప్పి అభినయిస్తూ, LF కి వెళ్ళిపోతాడు.)

రాం—(LF కేసి చూస్తూ ఆశ్చర్యంతో) అయ్యో అయ్యో! ఇంతా అంతా ఆకర్ణనీయం అని చెప్పడానికి వీల్లేదుట నాతో ప్రళయం! ఆ పడుచువాళ్ళూ అంతే, ఈ ముసిలివాడూ అంతే! ఈ మొగాళ్ళందరికీ ఇల్లా వచ్చిందేం_ ఒకటే ప్రళయం!

(అని ముక్కుమీద వేలేసుగుని, తిప్పుగుంటూ RF కి వెడుతుండగా, ఎదటి తెర పడుతుంది.)